౨ - (వెఱపుచేసుకొను) అంగలార్చు.

**అంగలారుపు** } చూ, ౮ అంచు.
**అంగలార్చు** } (౨) చూ, ౨ అంచు.

**అంగలించు** = (పూను) అగ్గలించు, అడరు, అప్పళించు, ఉంకించు, ఉదియగొను, ఉద్యోగసేయు, ఊంకించు, ఊఁకు, ఊఁకువగు, ఎత్తుకొను, ఒగ్గు, ఒడిగట్టు, కడంగు, కడుకొను, కదలు, కయికొను, కేలు, కైకొను, కొనకొను, కోలుకొను, కోల్కొను, గమకించు, గుఱికొను, గొనకొను, నాగు, చెలఁగు, చూచు, జతనపడు, తెక్కొను, తటిగొను, తలకొను, తలపడు, తలపెట్టు, తవురు, తూకొను, తొడఁగు, తొడరు, త్రోచు, దొరఁకొను, నుసలు, నెట్టుకొను, పట్టు, పూను, పయికొను, పాలుపడు, పాల్పడు, పూఁచు, పెఱుగు, పేటుకట్టు, పైకొను, పోపు, మలయు, మేకొను, మొక్కలించు, మొగియు, మొదలుకొను, మొదలుపెట్టు, మొనకట్టు, మొనకొను, మొనయు, వనిగొను, వీఁగు, సమకట్టు, సాగు.

౨ - (మీఱు) అతిక్రమించు, ఒత్తరించు, కడచు, గుంపించు, జవదాఁటు, తటియు, తలకడచు, దాఁటు, మీఱు, వాలు.

**అంగళ్లవాడ** = (బజారు) గంజు, పెంట, పేట, బజారు, బాజారు

**అంగి** = చూ, అంగరక

**అంగిటిముల్లు** = (కుత్తుకలోపలఁ గఱిగెడు నొకజబ్బు) అకిమి, కీక.

**అంగిలి** = (లోకుత్తుక)

**అంగిలిగుంట** = (కుత్తుకలోని పల్లము) నాలుకగుంట, వాకిలి

**అంగీ** = చూ, అంగరక.

**అంగీకము** = (తగినది)

**అంగు** = చూ, అంగము

**అంగుదుడిపి** } (అక్కడిమాటల నిక్కడ నిక్కడి
**అంగుదుడుపు** } మాటల నక్కడఁ జెప్పెడువాఁడు)
తంటలమారి, తంటాలమారి, బంతెలమారి.

**అంగుడు** = (దొడ మీఁదిక్రొవ్వు)

**అంగూరు** = (ఒకానొక పంట్ల తీఁగె) ద్రాక్ష.

**అంచ** = (దగ్గఱ) అంచు, అంజ, అండ, అందిక, అందికోలు, అందుపాటు, అందుబడి, అఱు, అబ్బు, ఒద్ద, కడ, కురంటు, కుఱంగట, కుఱంగలి, కెలన, కేవ, గరిడి, గాడ, చక్కి, చెంగట, చెంత, చేయలంతి, చేరిక, చేరు, చేరువ, చేరుపు, చేరుబడి, చేరువ, చేర్వ, చేవాటు, టోకు, డగర, డగ్గర, డగ్గఱ, డాపు, తటి, తారసము, దండ, దగ్గఱ, దరి, దాపు, పంచ, పజ్జ, పాలు, పొంత, పొందిక, పొక్కి, పొరుగు, పొరువు, పొగ్గు, పాశ్రి, మందటు, మందల, వద్ద, సంగడము, సంగడి, సంత, సాస

**అంచన** = (ఒకదాని యెచ్చుతగ్గుల నెంచుట)

**అంచనదారుఁడు** = (ఒకదానియెచ్చుతగ్గుల నెంచువాఁడు)

**అంచల** = (పక్షి) చూ, అంచ.

**అంచలము** = (చిఱ్ఱు) చూ, ౨ అంకపొంకములు.

**అంచించు** = (ఒకదాని యెచ్చుతగ్గుల నెంచు)

**అంచియ** = (జాబులు లోనగునవి మోచుకొనిపోయెడు వారున్న, బండ్లులోనగు నవియును దారిలో నక్కడక్కడ నిలిచెడి చోటు)

**అంచు** = (కొంగు) ఏకస, ఓర, కొంగు, చుంగు, చెంగు, చెరఁగు, చెఱఁగు.
౨ - (తీరు) చూ, అంగము.
3 - (దగ్గఱ) చూ, అంచ.
౪ - (తుద) కడపట, కొనకొమ్ము, కొస, కోన, చివ్ర, చివర, చెల, తుద మిత్తికు, మొన, సుద.
౫ - (బండికంటియాకు)
౬ - (పనుచు) అంపించు, అంప్ర, అనుచు, అనుపు, పంచు, పంతగించు, పంపించు, పంపు, పంపుపెట్టు, పనిగొను, పనికంచు, పనుచు, పుచ్చు, పుత్తెంచు, పురికొలుపు, వందలించు, ముదలకొట్టు, సాగవేయు, సెలవిచ్చు.
౭ - (అరుగఁజేయు) అనుచు, అన్చు.
౮ - (పుచ్చు) అనుచు, అన్చు.

**అంచులవాఁడు** = (బొమ్మలువేయువాఁడు) జీనిగిరివాఁడు, ముచ్చి.

**అంచులు** = (చనుమొనలు) కొనలు, గుబ్బలు, చను గొనలు, చనుముక్కులు, చనుమొనలు, చనుమోములు, చూచులు, బొగడలు, ముకులు, ముక్కులు.

**అంచె** = చూ, అంచియు

**అంచెలు** = (వరుస) ఓళి, చాలు, చాలుప, చాల్ప, తరబడి, తరము, తోరణ, దొంతి, పదుగు, పరి, పన్నుజు, పొంజు, బంతి, బారు, మురము, మూగ్మ, వంతు, సొంది, సొలపు, సోరి

**అంచెలుగట్టు** = (ఒకదాని వెనుక నొకటి వరుసగా నుండు)

**అంజ** = (అడుగు) అంకె, అజ్జ, అడుగు, అడుపు, అడ్గ కాలు, మెటికె, మెట్టు, హంజ, హజ్జ

౨ - (దగ్గఱ) చూ, అంచ

**అంజనకాడు** = (ముచ్చిలీన సొమ్మును దెప్పించునట్టియు, నేలలో నున్న వాటిని గనుంగొనునట్టియు దెయ్యములలోనగు వాని లోబర్చుకొనునట్టియు దంత్రిగాడు)

**అంజమెడపట్టు** = (జెట్టిపెనకువలో నొకతీరు - అందలి రకములు)
అరమీటుమొన, ఉత్తరడొక్కరము, ఎడపడువుపరువడి, ఒంటియడుగుగత్తెర, కందణము, కందనము, కత్తి, కత్తెర, కన్నాతు, కర్ణాతు, కల్లము, కళపము, కాసెనిల్కడ, కిర్లి, కుడియడుగుపరువడి, కుర్రింపు, కెర్లి, కెర్లి, గళ కత్తెర, గుపారము, గుజారము, గొంతుమాలు, చడి చలికి, చాంగణ, చాళియ, చాళి, చేబ, జేబ, జోడింపు, డొక్కర, డొక్కరము, తడకాలు, తాటిడగుమొన, తాళము, తిణింగి, తొక్కుస, తొట్టి, తోరహస్తము, దాటుడుగుపరువడి, పణము, పరిచాళిక, పారము, పెట్లాగు, బరిపోటు, ముత్తెర, మెత్తెర, రాటము, రింజ, రూణింపు, రొండిపేరిటు, లాగు, లోబిత్తెరి, లోమొన, లోలొంకె, వింటాలము, విన్నాణము, విసుమొన, వెలిబిత్తెర, సందుసీసము, సమము, సరసీసము, సరిబిత్తెరము, సీసకము, సీసము, సుబాము, సురాటము

**అంజలి** }
**అంజలికి** } (పుడిసిలి) దోయిలి, దోసిలి

**అంజలిగుంజలి** = (గాసి నొందినది)

**అంజాయించు** = (సందియపడు) అరగలిగొను, మెరి మెరపడు, సంశయపడు

**అంజి** = (పిల్లలాడుకొను నొకయాట - అందలి రకములు.)
అచ్చనగండ్లు, అచ్చనగాయలు, అచ్చనలు, అమ్మనములు, అమ్మనలు, ఈనిగాజులు, ఉద్దపల్లంచి, కుచ్చెళ్లు, కుప్పెలు, గుజగుజరేకులు, గొబ్బిళ్లు, చిలుతనబిల్లలు, జాబిళ్లు, పింపిళ్ల, పింపిళులు, పింపిసలు, బొమ్మరెండ్లండ్లు, మేలుమచ్చులు

**అంజిక** = (దిగులు) అటును, అడలు, అడుకు, అదరు, అదరుపాటు, అదురు, అలుకు, అసురు, అప్కు, ఉత్తలపాటు, ఉత్తలము, ఉదిల, ఉదురు, ఉలుకు, ఎద, ఓజ, ఓవు, ఓటమి, కన్నొటు, కొంకు, గగ్గోలు, గిలి, జంకు, జంకెన, జడుపు, జలదరింపు, జళుకు, జాలి, డాపు, తలంకు, తలంకు, తలరు, తల్లడింపు, తేకువ, దళుకు, దాపు, దిగులు, పంగు, పయిలోట, బీతు, బెగడు, బెగ్గడు, బెగ్గలము, బెగ్గలికము, బెగ్గిలుట, బెదరు, వెరగు, వెఱ వెఱగు, వెఱపు

**అంజిపోయాలు** = (గవ్వలాట)

**అంజు** = (దిగులుపడు) అడలు, అదరు, అలుకు, అళుకు, ఉలుకు, ఎదకడు, ఓడు, కొంకు, కోచవాఱు, గ్రక్కతిల్లు, జంకు, జడియు, తలంకు, దద్దరిల్లు, దద్దఱు, దిగ్గని, దిప్పరించు, పిఱుకడు, పుల్లగిలు, పుల్లగిల్లు, పొక్కు, బీతుకొను, బెగడు, బెగడుపడు, బెగ్గడలు, బెగ్గిల్లు, బెగ్గడు, బెగ్గలించు, బెగ్గిలు, బెగ్గిల్లు, బెదరు, బెదిరిపడు, సంగాడించు, సంచాలించు, వెఱపుఱుము, వెఱచు, సుర్కు

**అంజూరు** = (అత్తిచెట్టు) అత్తి, అత్తిమాను, బొడ్డ, మేడి

**అంజె** = (కాలియడుగు) చూ ౧. అంజ

**అంట** = (తోలు) అట్ట, కళాసము, చట్ట, చెక్కు, తాట, తిత్తి, తొంట, తొక్కు, తొక్కు, తొడప, తొడవసము, తొలుసు, తోడు, తోడుపట్టు, తోలు, తోలుక, పట్ట.
౨ - (కట్టుడాకు) ఆకు, కుట్టుడాకు, తాపరపాకు, పులియ, పుల్లియ, పుల్లె, విస్తర, విస్తరి, విస్తరంట.
3 - (అనట.)
౪ - (అడ.)
౫ - (గుంపు)

**అంటగు** = (కడకుబోవు.) కడకుబోవు, కొంగుమాయు,

తెలుఁగుమాయు, వెలుపలనుండు

**అంటగట్టుట** = ( బిగియఁగట్టుట )

**అంటనిజేజే** = ( నిప్పు ) అంటరాని వేల్పు అన్నిదిను వాఁడు, ఎఱ్ఱనివేలుపు ఏడికవజేరు, కప్పుతెరవుజాడ, కప్పుతెరవుదారి, కప్పులోర్వరి, కప్పుఁదెరువరి, కరుకలి వింద, గాడుపుసంగడీఁడు, గాలిచూలి, గాలినెచ్చెలి, చవుగంటి, చొగంటి, జంట మోమువేలుపు, తిగను బాబాసామి, తిగరుచవుతు, తగరురౌతు, తిగకాళ్లదేవర, తెమ్మెరచెలి, దంటమోములదేవర, దుగమొగములవేల్పు దుగమోములయ్య, నాల్గుకన్నులవేల్పు నీచకానపు నీటిచూలి, నీరుపాము, నీరుపుట్టువు, నబ్బుపూనిసువు, వినుమనుచఁడు, వేఁడివేలుపు, వేల్పులమొగము, సతనాలుకలదునీఁడు, సతనాల్కలజేజే, సతనాల్కలపాదుసా, సెగతోఁడు

**అంటలు** = ( గుంపు ) అట్టియ అట్టము కందువ, కూటువ, కూటువు, కొలము, గడ, గుమి, గుంపు, గుబురు, గుమి, గుమురు, చేరువ, జంజా, జట్టు, జోక, తల, తుటుము, తుట్టియ, తుట్టె, తుమము, తెగ, తెట్టువ, తెట్టె, తెట్టెము, తెబక, తెరలిక, తెవ తొగ, తొట్టు తొట్టువ తోయము, త్రుట్టియ త్రుట్టె దండు, దడము, దాఁటు దిన్నె, దిమ్మ, నతిక, పయికము, పరి, పఱ, పిండు పైకము, పొట్లము, పోతము పోడి, బారు బింజము, ముంపు, మూఁక, మొగి, మొత్తము, మొల్లమి, మొల్లము రొక్కము, లంపు, లేక సంగడి

**అంటరానివేల్పు** = చూ, అంటని జేజే

**అంటనిలంబడుట** = ( నేలంటి దిగంబడుట )

**అంటసిల్లు** = ( చేరు ) ఇతియు, ఎడతాఁకు, ఎలయు, ఒడఁగూడు, ఒలయు, కదియఁబడు, కదియు, కాలు ద్రొక్కు, కిట్టు, కినియు, కూడఁబడు, చేరు, దగ్గఱించు దగ్గఱు, డాకొను, డాయు, తటియఁబడు, తటియు తారసించు, తారసిలు, తారసిల్లు, తాకు, పెండెకడు, దగ్గఱించు, దగ్గఱు, దాకొను దాపించు, దాయు, పెనఁగుకడు, పెనఁగొను, పొలయు

**అంటాకు** = ( అరటాకు )

౨ - ( ఎంగిలి విస్తరి ) పులియ, పుస్లియ, పుల్లె

**అంటి** = ( అరఁటి ) అనఁటి, అరఁటి, అఱఁటి.

**అంటించు** = ( తేలులోనగునవికుట్టు ) కుట్టు, పొడుచు మీటు

౨ - ( అంటఁజేయు )

**అంటికొను** = ( ముట్టుకొను )

**అంటిగది** = ( వలపుగత్తె ) అంగలది, ఒడిసివాటు, చెడిప, చెడిపె, చెక్కలొయ్యాలి, తిరుగుఁబోతు నవపు కత్తె నసగూఁటి, బజాతి, బసవి, మిండకోర, మిండత, మిండలకోర, ఎండలకోరి, మిండఁడి, రంకుటాలి, రంకు లాఁడి, ఱంకుటాలు, ఱంకుఁబోతు, ఱంకులాఁడి, ఱంకెత, ఱాఁగ, వాడవదిన విటుకత్తె విటుకులాఁడి, వెలిచవుల్ గన్నలొయ్యలి వెడిచోరవరి, వెల్లాటుకత్తియ, వెల్లాటు కత్తె, వేమకత్తియ వేమకత్తె సొగసుకత్తె.

**అంటింత** = ( అంటుట )

**అంటిస** = ( ఒక దినుసు గడ్డి - అంపలి రకములు )

అంట్రింత, ఉలస, ఊదిర, కాంద్ర, కాకిఅల్లు, క్రోలు కసవు, గాబ గాబము గునుకు, గొలిక, గోళ్లగొండి, చిగిరింత, చెదారము, జంబు జమ్ము దూసరి నాలికచేరు, నెంద్ర, పర్పాటకము పూచి, పూచిక, పూసకాంచి, పాణుకుగడ్డి పానఁగు, బరపటు బూరగడ్డి ముయ్యం చుతుంగ, వంచవిదియ, వెత్తిచెఱకు

౨ - ( కూడిక ) తొడుసు, పాఁగెము

**అంటు** = ( నేస్తము ) అరిమ, అర్మిలి ఆగటు, ఇచ్చకము, ఎలమి ఎలసము కూరిమి గార్మి కెలవు, గాదిలి, గారము గారవము గారవింపు గారాబము, గారాబు, గారాము, నవు వనవు, చుట్టఱికము చెలికారము, చెలిమి, చెన్మి తగులము, తిరతీపు, తియ్యము, తీయము, నంటు, నెనరు, నెమ్మి నెమ్మిక నెయ్యమి, నెయ్యము, నేయము, నేస్తము, పెరిమ, పొంతము, పొందు, పొత్తు, బోరామి ప్రేముడి బాఁతి బాతి బాగ్రితి, మంకెమే లము, మక్కువ మచ్చిక, మచ్చికతనము, మనుకువ వాసిమి, ముద్దు మెచ్చు, మెప్పు, మేలు రమణ, రవణ, రహి, రాణ, లంకె సంగడము, సంగడి, సంగాతము, సమేలము సొరిడ, సరాగము

౨ - ( నేస్తకాఁడు ) అంటుకాఁడు, అనుఁగు, ఉద్దికాఁడు, చుట్టు, చుట్టము, చెలి, చెలికాఁడు, చెలిమరి చెలువుఁడు, నంటు, నంటుకాఁడు, ననుపుకాఁడు, నమ్మకాఁడు, నెచ్చెలి, నెయ్యరి, నెయ్యుఁడు, నేయుఁడు, నేస్తకాఁడు, నేస్తి నేస్తు పక్కము, పొందు, పొందుకాఁడు, పొత్తు కాఁడు, బోటిగాఁడు మిత్తు, సంగతికాఁడు, సంగడీఁడు, సంగాడి, సంగాతకాఁడు, సంగాతి

3 - (ఒండొరులమిక) అనుగుచేసనము అల్లిబిల్లి అల్లిబిల్లిక, ఆవటము, ఇమిడిక, ఇమ్ము ఎనయిక, ఎమ్మిక, ఒంటు, ఒండొరులమిక, ఒందిక, ఒద్దిక, ఒనరిక ఒనరు, ఒమ్మిక, ఒరిమ, ఒరిమిక, ఒలిమె, గారము, చెలిమి, చెల్మి, నెమ్మి, నెయ్యమి, నెయ్యము నేస్తము, పొంకము, పొత్తు, పొందిక, పొందు, పొసగు, పొసగుడు, వయికడి, మైవడి వియ్యము, వంటు వలన, సంగడము, సంగడి, సమేళము

౪ - (తాకుడు) సోకు సోకుడు.

౫ - (అంటరానివాటిని తాకుట)

౬ - (కూడిక.) కలయిక, కలియిక, కలుక, కూటమి, కూడిక, చేరిక, దనివు, పెనకువ, పొందిక, మేడము, లంకియ, లంకె సంగడము, సంతన, సమేలము, సయ్యొద్ద, సయ్యోద్ద

౭ - (ముట్టు) కుసుమ, కెళగు, ముట్టు

౮ - (చెట్టుగుటుకు జెట్టునండి వంచి పాతుట్టి కొమ్మ)

౯ - (పొందు) అంద అత్తు, ఊను, ఎనయు, ఎయిదు, ఎద్దు, ఎలయు, ఒంటు ఒంటుకొను, ఒందు, ఒలయు, కదియు, కను, కలయబడు, కలయు, కలవడు, కలియు కలుగు, కలువు, కల్గు, కాంచు కూడు, కూడు, కొలులు, క్రిక్కిరియు, చన, చెంద, చేరు, తారుకొను, తార్కొను, తొడరు, దవుకు, దక్కు, దూకొను, దొలయు, పడము, పడయు, పాటించు, పెనగు, పెరయు, పొంద, పొరయు, పొలయు ప్రిబ్బు బెరయు, మేకొన, సందుకొను, సన, హత్తు

౧౦ - (తాకు) అప్పళించు, చెనకు, చెనయు, తెలపడు, తాకు, తొట్టు, దవుకు, దక్కు, ముట్టు

౧౧ - (రుద్దు.) తోము, సాము, పులుము, పామ్రు, రాచు, రుద్దు, టాచు, వెలచు.

౧౨ - (మడి కానిది)

అంటుకత్తియ }
అంటుకత్తె } (నేస్తురాలు)

వంటుకత్తె నమ్ముకత్తె నెచ్చెలి, నెచ్చరి, నెయ్యురాలు, నేస్తకత్తియ, నేస్తకత్తె, నేస్తురాలు పొత్తుకత్తె, సంగాత కత్తియ, సంగాతికత్తె

అంటుకాడు = (సంగడీడు) చూ, ౨ అంటు

అంటుకొనిపోవు = (దొంగిలించు, కొనిపోవు) చూ, ౪. అంకించు.

అంటుకొను = (రగుల్కొను, నిప్పు ముట్టుకొను)

అంటుగాడు = (మిండడు) కోడె, కోడెకాడు, గోవాళ్లు, చెలువుడు, జుమ్మకాడు, జుమ్మడు, జుమ్మికాడు, టిరుగుబోతు, నసుపుకాడు, నస్పుకాడు, బొజుగు, మిండగాడు, మిండగీడు, మిండడు, ముండరి, ముండల మారి, లంజెకాడు, విటకాడు, వెచ్చకాడు, వేడుక కాడు, వేడ్కకాడు, సొగసుకాడు, హవుసుకాడు, హాసుకాడు

అంటుజోడు = (అంటుపోగులజతయును చెవులకుంచెడునవి)
అంటుపోగులు కత్తెరబావిలీ, కుంటెన, కుంటెన కుచ్చులు, కుంపెన, గుమ్మతీలు, చెవులపూవులు, జుమికీలు, దుద్దులు, పడగ, బవిర, బావిలీ, బావిలీగోలుసు, బిల్ల బుగడ, బొగడ, మద్దికాయలు, ముర్వు, రాళీ, గావిరేక.

అంటునూనియ }
అంటునూనె } (తలంటుకొను నూనె)

అంటుపడు = (మైలపడు.)

అంటుపూరు = ముత్తెపు జిప్పయందంటిన ముత్తెము)

అంటుపేను = (ఒకదినుసు పేను) అంట్లు.

అంటుపోగులు = (చెవినంటియుండెడివగు వారిచెవులవగ) చూ, అంటుజోడు

అంటుప్పు = (ఒకదినుసుప్పు) అట్టుప్పు, ఆకుప్పు, చవుటుప్పు చౌటుప్పు, దొనయుప్పు.

అంటుమెడ = (అణగిన మెడ)

అంటుతాయి = (నూడంటుబాయి) నూదంటుబాయి, నూతిరాయి

అంటెలు = (బొంతె) ౧౦౬, జడక, పప్పికపచ్చడము, బొంత.

౨ - (దొంతర ముడుతలు)

అంటోల్లు = (చూరునుండి పడు వానచినుకులు.)

అంటెగ్రింత = (ఒక దినుసు గడ్డి) చూ, అంటిస

అంట్లు = (వండి కడుగని గిన్నెలు.)

౨ - (అంటులు)

3 - చూ, అంటుపేను.

**అండ** = (ప్రాపు) ఆనిక, ఆనువు, ఆసరా, ఊఁత, ఊఁతము ఊనిక, కుదురు, చేపట్టు, తాపు, దండ, దండగోల, పట్టు, ప్రాపు, సలిగ.
౨ - (దగ్గఱ.) చూ, ౨ అంచ
౩ - (వెనుక) పజ్జ, వెనుక వెన్క, సంగడి

**అండగొట్టు** = (జాగుచేయు) అండగొను, అలయు, జాగిడు, జాగుచేయు, తడయు, తాఁవసించు, నట్టుకొట్టు, నుసలు, పంటించు, మసలు, వాలాయు.

**అండగొను** = చూ, అండగొట్టు
౨ - (ప్రాపుగొను)

**అండా** = (గుండిగ) కొప్పెర, గాబు, గుండిగ, తొట్టి

**అండి**
**అండీ** } (ఒక దినుసు పెద్దగిన్నె.)
౨ - (పెద్దలను పిలుచునప్పుడు మర్యాదజాపు పలుకు.)

**అండియ** = (వసంతములాడెడు క్రోవి)
అండె, కొమ్ము, చిమ్మనగొట్టము, చిమ్మనగ్రోలి, పింజన గ్రోవి, బుఱటకొమ్ము, బుఱ్ఱకొమ్ము, బుఱ్ఱటకొమ్ము

**అండియము** = చూ, అంకియము.

**అండె** = చూ, అండియ.

**అండెయు** = చూ, అంకియము.

**అంత** = (అంతయు) అంతెవట్టు, ఊఁచముట్టు
౨ - (అకొలఁది)
౩ - (అగుణింపఁదగినదాని కొలది)
౪ - (ఒకదాని కొలత) ఎదు, ఏసి.

**అంతన్** = (తర్వాత) అంతటన్, క్రిస్సన్, తర్వాత, పదంపడి, పదపడి, పిదప, పిమ్మటన్, వెంబడిన్, వెనుకన్, వెనుకల, వెన్కన్

**అంతంతన్** = (కొంత దవ్వున.)

**అంతకున్** = (అయినప్పటికిని)

**అంతకము** = (లెక్కమొత్తము) అంతు, టోకు, మొత్తము, వెరసి.

**అంతటన్** = చూ, అంతన్.

**అంతటికిన్** = (ఎల్లన్) ఎల్లన్, ఎల్లకాంటన్, ఎల్లకాంటకున్.

**అంతరదామర** = (ఒక దినుసు నీటిపాఁచి)

**అంతరపల్లటీ** = (ఒకదినుసు పారువము అందలి రకములు)
ఒడ్డి ఒడ్డిఁడు కుంకీ, చేపల్లటీ, జట్టి, దూరుబారు, నేల పల్లటీ, పల్లటీ, పేఁడగువ్వ, బకదారి, బుఱ్ఱపిట్ట, లకోరీ, సురటీ

**అంతరువు** = (ఎచ్చుతగ్గులు)
౨ - (మఱుఁగుచోటు) అంతస్తు

**అంతలంతలు** = (అంతేసియుంతేసి.)

**అంతపొంతలవారు** = (వరుసయైన చుట్టఱికము.)
అందిపొందినట్టివారు అందుపొందువారు

**అంతవట్టు** = చూ, ౧ అంత
౨ - (అంతియ.) అంతె, అంతే

**అంతస్తు** = చూ, ౨ అంతరువు
౨ - (తొట్టికట్టు.) చూ, ౨ అంకణము.
3 - (మీఁది యంతస్తు)
౪ - (పరువు)

**అంతికలు** = (చాఁపవలె నల్లిన కసవు తడికలు)

**అంతియ** = చూ, ౨. అంతికట్టు

**అంతు** = చూ, అంతకము.

**అంతె**
**అంతే** } (అంతియ) చూ, ౨. అంతకట్టు

**అందందన్** = (నటియు మటియు) అనయమున్, వటిమటి,
౨ - (అచ్చటచ్చటన్)

**అందన్** = (అక్కడన్.) అందున్, అక్కడన్, అగ్గడన్, అచటన్, అచ్చటన్, అటన్, అయ్యేడన్, అడన్, అయెడన్.

**అందంబుగూడుకొను** = (కలసికొను)

**అందకత్తియ**
**అందకత్తె** } (చక్కని యాఁడుది)
ఒయారి ఒయారికత్తె ఒయ్యారి, ఒయ్యారికత్తె, ఒఱపులాఁడి, ఓయారి, రూపరి, రూపసి, సొగసుకత్తె

**అందగాఁడు** = (చక్కనివాఁడు)
ఎమ్మెకాఁడు, ఒయారికాఁడు, ఒయ్యారికాఁడు, ఒఱపరి, ఒసపరి, ఓసుకాఁడు, గుమ్మఁడు, చిగిలికాఁడు, దిన్నెలాఁడు, చూడఁగలవాఁడు, చూపరి, చెన్నఁడు, చెలువుఁడు, జిగిసికాఁడు, గీటుకాఁడు, పరిష్కనివాఁడు,

బాగరి, మాన్యైనవాఁడు, రూపరి, రూపసి, లాడువాఁడు, వగకాఁడు, వగలాఁడు, వన్నెకాఁడు, వన్నెలాఁడు, నూటికాఁడు, సొగసుకాఁడు, సొబగుఁడు, హావుసుకాఁడు, హాసుకాఁడు

**అందగించు** = (చెన్నుఁగాంచు)
అందపడు, కోపువాఱు, బెడఁగారు, బెడఁగు

**అందగింపు** = (అందము) చూ, ౨ అంగము

**అందదుకు** = (మిక్కిలి యదుకుకలది)
౨ - (నిందుకానిది.)

**అందనుకన్** = (అంతిదనుక) అందాఁకన్

**అందపడు** = చూ, అందగించు.

**అందము** = (చక్కఁదనము) చూ, ౨ అంగము.
౨ - (ఒప్పిదము) అమఁగు, అలరు, ఆరజము, ఇమ్ము, ఒడికము, ఒనరు, ఒప్పిదము, ఒప్పు, ఒఱపు కలికి, కల్కి, కొమరు, గమకము, గొనబు, గొనము, గోజ, చక్కన, చని, చిన్ని, చెన్ను, చెలువు, చెల్వు, చోక, చోకా, చోకాటము, చోకారము, చొక్క, చొక్కటము, చొక్కతరము, చొక్కము, చోక్క, చోక్కటము, చోక్కారము, జాను, జోక, తనరు, తిన్న, తిన్నన, తిమ్మన, తియ్యము, తీరు, తోరము, నలువు, నాణెము, నాణేము, పొసరు, పొలుపు, పొల్పు, పరిన్న, బాగు, బెడఁగు, బెళఁగు, మాను, ముద్దు, ముసువు, రవణము, రవము, రాణ, రెస్స, విన్నాణము, సవురు, సొబగు, సౌరు, హరువు.

**అందఱు** = (ఎల్లరు) అందోఱు, ఎల్లరు, ఎల్లవారు.
౨ - (అంతమంది.) అందోఱు

**అందలములు**=(పిల్లలాడుకొను నాటల అందలి వేఱుడములు)
అక్కిబిక్కిదండ, అప్పచిలు, అప్పచ్చిలు, అప్పళములు, అళ్లి, అల్లోనేరళ్లు, ఆకుపోకెలు, ఆలంకగుడి, ఆలంకి, ఆలంకులు' ఇటికె, ఈలకూఁతలు, ఉప్పట్టు, ఉప్పనఁబట్టెలు, ఉప్పుఁగుంటము, ఉప్పులపోట్, ఏలపాటలు, ఒక్కసికొక్కు, ఒడ్డువిడుపు, ఓటిల్లుచిందర, ఓనఁగుంటలు, కంబాలాట, కట్టుపుట్టచెండ్లు, కట్టెగుజ్జము, కాలికంచము, కిల్లుగానుగు, కుందికాళ్లు, కుండెనగిరి, కుంచెనగుడి, కుప్పగంతులు, కుమ్మరసారెలు, కొండ కోఁతి, కోఁతికొమ్మచ్చి, కోలకోఁతులు, గంగెద్దులాట, గంటిపోళ్లాట, గచ్చకాయాట, గట్టెనబోది, గడ్డెబోద్ద, గుంటచాళ్లు, గుడిగుడిగుంచము, గుడుగుడుగుంచములు, గురిగింజ, గుజ్జెపెక్కుడు, గుళ్లు, గూడనాలు, గొబ్బిళ్లు, గోటదొళ్లుడుకాయ, గోడిపట్టెలు, గిచ్చకాయలు, చకారిలతిరిప్పుడు, చాకిబాన, చాకిమూట, చింతాకు చిఱుదు, చిందుపరువు, చిక్కణపిళ్లి, చిక్కనాబిల్లలు, చిటికలాట, చిట్లపొట్లకాయ, చిడుగుడు, చిమ్మతాయి, చిమ్ముబిల్లము చిరుతనగోడు, చిట్టిపట్టె, చిట్టుబుట్టు, చీఁకటిమొటికిళ్లు, చుండాళ్లు, చెండ్లు, జిరుకుతాఁతి దాబాటలు, తన్నుబిల్ల తాటాకుచక్కర, తాళ్లపాము, తుమ్మెదరేపులు, తూనరతుక్కము, తూనిఁగతానిగ, తూనెకొట్లాట, తూరనగోలలు, తూరనదుక్కా, తూరన తుంకము, తోడా, త్రిప్పుళ్లు, త్రొక్కుడుబిళ్ల, దాట్రాయి, దూబూచులు దూఱుదుంకెన, దోకుడుబారా, నట్టు కోఁతి, నట్టువాలు, నాలుగుకంబాలాట, నీగిపోగిస నెటికతట్లు, నెట్టుడుగాయ, నెట్టులు, నెట్లు, పిడిగుద్దులు, పిల్లగిఱులు, పిల్లదీపు, పిల్లదీవి, పుటచెండు, పుట్టచెండు, పిడికళ్లు, పులియాట, పెంచులచేరీ, పొదుకునీళ్లు, బండికలు, బంతిమూగులాట, బందారు, బసవన్నాట, పిల్ల గోళ్లు, పిల్లబిడ్డము, బుడికిసు, బూచికన్నులకచ్చు, బొట్టనగోలలు, బొమ్మరములు, బోటిబాళ్లు, బోర్లపక్కి, మంకెలు, మొకమాట, రామన్నాట, విగ్గియము, విగ్గము, వినాయకుపిరి, వెన్నెలకుప్పలు, వ్రేలుబొట్టన, సరి వేసులు, సింగన్నాఁటులు, సిరిసింగణావత్తి, సిరిసింగ ణాలవత్తి.

**అందలి** = (అచ్చటనున్నట్టి)

**అందాఁకన్** = చూ, అందనుకన్.

**అందాలు** = (సొగసులు)

**అందిక** / **అందికోలు** } (పగ్గము) చూ, అంద.

**అందికొనుట** = (అందుకొనుట)

**అందిపొందనట్టివారు** / **అందిపొందువారలు** } చూ, అంతలపొంతలవారు.

**అందియ** = (ఆఁడువారు కాళ్లవంచెడు నగ,) అందె.

**అందు** = (పొందు.) చూ, ౧. అంటు
౨ - (చైకొను.) అందుకొను, అప్పళించు, ఎత్తు, ఏలు, ఏలుకొను, కముచు, కయికొను, చైకొను, కొను, క్రోలు,

గొబ్బు, చేకొను, చేపట్టు, తొడుకు, పట్టు, పుచ్చు, పుచ్చుకొను, పుడుకు, పుణుకు.

**అందున్** = (అచ్చటన్.) చూ, అందన్.

**అందుకొను** = చూ, ౨. అందు.

**అందుకోలు** = (అందుకొనుట.)

౨ - (చాలాదగ్గఱ)

**అందుగు** = (ఒకానొక చెట్టు.) అందువు, మురము, మురుము.

**అందుపాటు** = (దగ్గఱ.) చూ, అంచ.

**అందుబడి** = (పొందబడినది.)

౨ - (చేరువ.) చూ, అంచ.

**అందుము** = (పల్కుడుము)

**అందులకున్** = (అచ్చోటికి)

౨.- (దానికి.)

**అందువు** = చూ, అందుగు.

**అందె** = చూ, అందియ.

**అందెబందెలు** = (చిక్కులు.) చాఁపలు

**అందోఱు** = చూ, అందఱు

**అంప** = (కోల.) అంపకోల, అంపఱ, అంబు, అమ్ము, అలుఁగు, అల్లు, కట్టియ, కట్టె, కోల, గసిక, గిఱ్ఱు, చిలుకు, జట్టు, జిరా, జిరాయి, తీరు, తూపు, తోడుగు, తోడువు, తొగ్గు, బరిగోల, ములికి, ముల్కి, లకోరి, సముడు, సెల, సెలకట్టియ, సెలకట్టె.

**అంపకము** = (అంపుట.)

**అంపకాఁడు** = (విలుకాఁడు.) వింటివాఁడు, విలుకాఁడు, విలుదాలుపు, విలుదాల్పు, విలువాఁడు, విల్కాఁడు.

౨ - (గుఱికాఁడు.) గుఱికాఁడు, సూటికాఁడు

**అంపకోల** = చూ, అంప,

**అంపగరి** = (తూపునకుఁ గట్టిన యీఁకెలు.)

**అంపఱ** = (తూపు) చూ, అంప.

౨ - (తూపుల మొత్తము)

**అంపాచారము** = (నీటి పాఱుదల.) ఓడిక, జక్కర, నిట్టు, నీళ్లపాఱుదు, పఱత, పఱతి, పఱద, పఱవ, పాఱుదు, కరద కఱద, కట్టు, కొల్లి, కొల్లిక, కొల్లక.

**అంపి** = (కలయంపి.)

**అంపించు** = చూ, ౬, అంచు,

**అంపియ** = (చంపిగుడ్డ) అంపె, అఱ, కప్పడము, చింపి, చీరిక, పాఁత, ప్రాఁత, పీలిక,

**అంపు** = (ఒకానొక పండుగ అందలి వేడుకలు)

కొలుపు, కొలువు, కొల్వు, జాతర, తంతు, తేవ, సాకము.

౨ - (ఇది యిట్లు చేయవలయునని సెలవిచ్చు) చూ, ౬ అంచు.

3 - (పుచ్చు.)

**అంపుదోడు** .- (బయలుదేరిపోవువారికి తోడుగా నంపఁబడు వాఁడు.)

**అంపె** = చూ, అంపియ.

**అంబకళము** = (ఒక దినుసు జావ) అంబలి.

**అంబటిజోరిగాఁడు** = (ఒకానొక పులుఁగు అందలి వేఱడములు.)

అలజడిదరి, ఆసకి స్పెరగాఁడు, ఉల్లంకి, ఉల్లఁగి, ఉల్లాము, ఉక్కపిట్ట, ఎబ్బెర, కరడు, కల్లెదు, కఱుకు, కర్కు, కాటిగాఁడు, కుటాకి, కూఁకటికుక్వ, కొగ్గంబు, కేరిజము, కేగ్గము, గడ్డిపిట్ట, గావ, గుండుములపుగాఁడు, గుడుగు రావిలము, గున్నంగి, గూడబాతు, గొంగడికాఁడు, గొబడి, గోగడి, చల్లపిట్ట, చాకిబాన, చీతలవ, జిట్టు, జీనువ, జీనువాయి, జుమ్మ, డాబ, తప్పడుగాఁడు, తేన గద్ద, దాబ, దోరువా, నల్లచ్చిగాఁడు, నేలనమలి, పగడంపుజిట్ట, పడుదల, పరజ, పతిక, పతిగపిట్ట, పాతుకాఁడు, పాములనారిగాఁడు, పాలకాకి, పావళము, పురిడిపిట్ట, పూరడు, పూరేడు, పెడిస పొట్టిపిట్ట, పాడిపిట్ట, పొన్నంగి, పోతుకాఁడు, పోపిట్ట, పోలుగ, పోలువ, బంగరుపిచ్చిక, బట్టమేక, బెలంచి, బెళగువ్వ, బెళవ, బొత్తజిట్ట, మాస, ముల్లంగిపిట్ట, మూఁగ, రివ్వ, లాటి, లావిల, లోటుకజిట్ట, లొట్టకన్ను జిట్ట, వంగపండు, వరికి, వాజము, వామన, వామనపాతుకాఁడు, వెదురు కంపజిట్ట వెదురుపిచ్చిక, వెన్నడాయి, వెన్నముద్దకోడి

**అంబరు** = (మంచి వలపులూరెడి దినుసు)

**అంబలము** = (గుంపునఁబుట్టిన పెద్దమ్రాఁత)

అలబలము, అరజము, ఎలగోలు, కోలకోల, గందరగోళము, గెల్లు, గోలకు, గోలగోల, గోల్లు, రచ్చ రొద, అంతు, అంపు, హాళి హాళి

**అంబలి** = చూ, అంబకళము.

**అంబస్తు** = (డంబములేనివాఁడు) దమ్మడు

**అంబారము** = వర్లలోనగు దినుసుల పోఁగు) అంబారు

**అంబారి** = (ఏనుఁగుమీఁదఁగట్టుపీఁట) చవుడోలు, చౌడోలు, పల్లన, పల్లనము, హౌదా

**అంబారు** = చూ, అంబారము.

**అంబారుపిడుఁజు** = (నాల్గుకాళ్ల మైతాల్పుల మేనసంటుకొని నల్లఁబీల్చెడు జెలగ)
చెక్కకోణుజు, చెక్కకోణుదురు, చెక్కపిడుఁజు, జలగ, జెలగ, నల్లద్రాగుడు, నల్లద్రావుడు, బుడ్డపిడుఁదు.

**అంబాళము** = (ఒకానొక చెట్టు)

**అంబు** = (తూపు) చూ, అంప.

౨ - (మేదరవానియొక్క అమ్ముపంటి యొక యినుపకొఱముట్టు)

**అంబునక్కెర** =(ఒకానొక చేప - అందలి భేదములు)
అరుజు, అల్లెనమ్మ ఆఁకుజెల్ల ఇంగిలాయి, ఇల్లస, ఇల్లెపుచేఁప, ఇల్లెము, ఈసపిట్ట, ఉణుజు, ఉప్పుఁజేఁప, ఉరుకు, ఉల్లాకుఁజేఁప, ఉల్లికుచ్చడము, ఒల్లెంక, కడిసెల, కనుగుఁజేఁప, కల్లరుజు, కాగిస, కుంటముక్కు, కూరముక్కు, కొరదు, కొరద, గుడిజెల్ల, గడ్డె, గొల్లదొందు, చందమామపక్కి, చంమవాచేఁప, చాఱ, చాఱమీను, చిత్తర, చీఱచింపు, చుక్కకార, చుక్కపిల్ల డేఁకి, తిమితిమీను, తిరర, తిటికి, తెల్లనార, తొల్లిక, దాసరికొయ్య, దొందు, నీరుపాపర, పక్కి, పయిజారుతట్ట, పల్లికతట్ట పరిగియ, పరిగె, పట్టెమీన, పాలచేఁప, పాలచొఱ, పుత్తడికాసు, పులస, పులిమెకము, పులుచు, పుల్లరుజు పూఁజేఁప, పూమేన, పూలమట్ట, పైగాలు వట్ట పొనగుచేఁప, పొరకచేఁప, పొలస, పోసకొక్కి, బుడ్డపక్కి, బొంకప్ప, బొంపపక్కి, బొచ్చె, బొమ్మడాయ, మంగలపక్కి, మట్టగిడుసు, మడవచేఁప, మలుఁగు, మాచెనపక్కి, మాతగొరక, మిసి, మిసికల్లు, ముకుదొమ్మ, ముచ్చంగి, ముట్టెచేఁప, ములువాలుగ, మెత్తడి, మేన, మొట్టె, మొరపక్కి, రాతిగొరక, రాస, లంజెబేడిస, లత్తిచేఁప, వంజరము, వంజు, వందొందు, వజ్జిరము, వడగర్వ, వాలుగ, వాలుగబొంకి, వాలుగపాము, వాలువు, వింజిలి, వెలిమొట్ట, సొరంగి.

**అంబులపొది** = (తూపులుంచుకొను పొది.)
తరకసము, తరకసా, పాణివడము, పొది, పొస, బత్తడిక, బత్తళి, బత్తళిక,

**అంబే** = (ఆవుమూడకూఁత) ఉంబ, డే.

**అంబేద** = (దిట్టతనము లేనివాఁడు - పనికిమాలినవాఁడు)
ఈబరి, ఈబరిగొట్టు, ఉటియ, ఎంగిలికాయ, ఎంబన్న, ఎనగొట్టు, ఏబరాసి, కలుముచ్చు, కసుమాలము, కానివాఁడు, కిగ్గాడి, కొఱగానివాఁడు, కొంపచెఱుపు, గలపడింపు, గుండెకుళ్లు, గొడ్డుఁబోతు, చూపుగుజ్జము, డాకూళ్లమారి, దూబ, నడపీనుఁగు, బికారి, మూసనమురికి, లేకి, లేకివాఁడు, వాఁజె.

**అక** = (తనకంటె పెద్దదైనతోడఁబుట్టువు) అక్క, అప, అప్ప.

౨ - (వంటఁజేసెడు యాఁడుది.)
అక్క, అడబాల, బోనకత్తియ, బోనకత్తె, బోనముకత్తె, వంటకత్తియ, వంటకత్తె, వంటరి, వంటలక్క

3 - (మన్నింపఁదగిన యాఁడుది.)
అక్క, అమ, అమ్మ, అవ, అవ్వ

**అకట**
**అకటకట**
**అకటకటా**
**అకటా**
(కారుఁగుటయందగునది.) చూ. 2. అంగద.

**అకటవికటము**
**అకటావికటము**
(మాఱుదల)
అదవద, అల్లకల్లోలము, ఈరతార, ఉత్తలము, ఎడనుడుగు, ఎడమదుడ్డు, ఒఱవ, కక్కిరిబిక్కిరి, గచ్చువిచ్చు, చిదగొద, తడఁబాటు, తబ్బిబ్బు, తారుమాఱు, తాఱుమాఱు, తిబిరి, తిరుగుడు, తెఱపుమఱపు, పల్లటి, పల్లటము, పెడ, మాఱుదల, మాఱుపాటు, వింగడము, విటతటము, విటతాటనము, విటతాటము, వీటతటము, వీటతాటనము, వీటతాటము, వీడుపాటు, వీడ్పాటు, వెగడు, హల్లకల్లోలము.

**అకరు**
**అకరువు**
(తామరదుద్దులోనగువాని చుట్టు నుండునది.)

**అకో**
**అకో**
(ఒక్క) అటె, అట్టె, ఒ, ఒకొ, ఒకో, ఒకొక్క, ఒకొక్క, ఓ.

**అక్కలవాడ** – (వంటలక్కలుండెడివాడ)

**అక్కలి** = (అల) అల, కడలు, కరండము, కర కరడు, కరడము తరఁగ, తఱులు, తెర, తొలఁకు, వాఁగులు.

**అక్కలించు** = (సగ్గించు- ఊపిరిబిగఁబట్టి కడుపును లోపలికిం దీసికొనుట)

**అక్కసము** = (కనికరము.) చూ, అక్కటిక.

౨ - (మఱుగుడు) అరటము, ఆరాటము, ఆలి, ఉడుకు ఉత్తలము, ఉదిల, ఒఱపు, ఒల్లఁబోక, కంది, కంగు, కాఁక, కాఁగుడు, కర్లు, క్రాఁక, క్రాఁగుడు, గొవరు, చిచ్చు, చిటచిట, జావరము, తనకు తక్కు, తుందుడుకు, తుకతుక, దగ, నలఁకువ, మండ్రాటము, మఱుకువ, మఱుగుడు మల్లడి, వంత, వగ, వడ, వేండ్రము, వేఁడి, వేఁడిమి, సెక, సెగ, సెక, సేఁకము.

**అక్కసి** = (కినుకగలవాఁడు) అక్కసుకాఁడు, కినుకకాఁడు

**అక్కసు** = (కినుక) చూ, ౨ అంకపొంకములు.

**అక్కసుకాఁడు** = చూ, అక్కసి

**అక్కి** = (ఒకపొక్కజబ్బు - అందలి వేఱుపములు) చిరుగుడు, చీడ, తెగులు, తెవులు, నలఁక, నలఁకువ, నలి, నలుకువ, నొవ్వి, నొవ్వు, నోవి, నోవు, బంక, రుగ్మత.

**అక్కిబొక్కిదండ** = (ఒకానొక పిల్లల యాట.) చూ, అంపలములు

**అక్కిలి** = (కలఁత) చూ, ౨ అంక

**అక్కిలిపడు** = (కలఁతపడు.) అతిముతిపడు, ఉగ్గాడు, ఉత్తలపడు, కలఁకఁబాఱు, కలఁగఁబడు, కలగుండుకొను, కలగుండువడు, కలగొను, కలవరపడు, కలవరపోవు, కలుచపడు, కళవళపడు, కళవళించు, కాఁదుపడు, కావ్రపడు, కొందలించు, కొందలపడు, గగ్గోలుపడు, గజిబిజించు, గలబరించు, చివుక్కురుమను, తలకు, తరవడు, తెగచు తెరలు, దురపిల్లు, పుల్లసిలు, ప్రల్లసిల్లు, పారిపోవు, బెగ్గడిల్లు, సుడివడు

**అక్కు** = (ఱొమ్ము) ఉరప ఎడఁద, ఎడ్ద, ఎద, చనువఱ, బోర, గొమ్ము, ఱొమ్ము.

**అక్కుళ్లు** = (ఒకదినుసు వడ్లు - అందలి వేఱుపములు) అనములు, అకుసన్నములు, అరెవడ్లు, ఇప్పపూరాజనములు, ఉద్దులు, ఉలవలు, ఊపిరులు, ఎద్దుకొమ్ములవంకెలు, ఎఱ్ఱడాలు, ఏనుగుకొమ్ములు, ఏలికిరాజనాలు, ఒదివిరిప్రాలు, కందికటికసరులు, కిన్నెసరులు, కప్పురబోగులు, కస్తురిపట్టియలు, కస్తురిపట్టెలు, కస్తూరినిగరాలు, కస్తూరిపట్టెలు, కాకిఱెక్కలు, కురువడాలు, కుసుమలు, కుసుమములు, కుసుంపూరాజనాలు, కోడిబుడమలు, కోదండరామములు, క్రేడి, గంగాజలంబులు, గందసరులు, గంబూరరాజనాలు, గరికసన్నాలు, గరుడసరులు, గర్వసములు, గాజుకెవ్వరలు గుత్తులుగుత్తులు, గుత్తివడ్లెలు, గుస్తులు, గొజ్జెగిబ్రాలు, గొబ్బికాయలు, గోదుమలు, గోపరాజనాలు, గౌరికుంకుమలు, చంద్రవంకలు, చామలు, చిపెముత్తెము, చిఱువడ్లు, చిలుకముక్కులు, చెండ్రవంకలు, చెనగులు, చెన్నంగులు, చేమపూరాజనములు, జాలు, జవ్వాజివంకెలు, జాజిరాజనములు, జిలకఱరాజనములు జిలమలు, జీనిసరులు, జీనువముక్కులు, జున్నఁబ్రాలు, జొన్నలు, తావి, తరువరంగములు, తీఁగమల్లియలు తీఁగవడ్లెలు, తీఁగెమల్లియలు, తీఁగసరులు, తీఁగెసరులు తీవెసరులు, తుమ్మిపూరాజనాలు, తెల్లచెన్నంగులు, తెల్లబుడమలు, దినసరులు, దెబ్బసరులు, దేవసరులు, నక్కతోకదివ్యము, నల్లచెన్నంగులు, నల్లబుడమలు నల్లయారెలు నాగవడ్లెలు, నీరుకావులు, నువ్వులు, నెమిలివడ్లు, పవడంపుతీఁగెలు, పచ్చగన్నేరు, పచ్చకర్పూరపుసరులు, పచ్చసరులు, పాలకన్న, పాలమీఁగడలు, పాసంగు, పిచ్చుకగోళ్లు, పునాసలు, పునుఁగు, పునాసాటికడాలు, పునుఁగురాజనాలు, పులిగోళ్లవంకెలు, పూఁబాళలు, పూరేకులు, పెసలు, పొంగుప్రాలు, పోతుగంటిరాజనములు, ప్రయాగలు, బంగారుతీఁగెలు, బలుగుత్తులు, బారతసేసలు, బాహుపురులు, బీటిసరులు, బొగడసరులు, బొబ్బరలు, మంకెనలు, మండిపంద్రిలు, మణిసరులు, మల్లెలు, మామిడిగుత్తులు, మినుములు, ముత్తెసరులు, ముడుకసరులు, ముద్దుప్రాలు, మొలకులికలు, మోదుగుతొడిగెలు, మోదుగుమావలు, మోహనపునగులు రంభపెండ్లికొడుకులు, రత్నసరులు, రాజనములు, రాజనాలు, రామబాణాలు, రామసాగరములు, రెడ్డిపాలవంకెలు, రెక్కపాయలు, లక్షుకబొత్తులు, వంకసన్నములు, వంగాకుబుడమలు, వజ్రంపుదసుకులు, వట్టిసరులు, వన్నెపూలు, వరలు, వాసనరాజ

**అగలుసత్తు** = (ఒకానొక మంచి కలపు దినుసు)

**అగలుసాంబి** = (ఒక మందు దినుసు)

**అగవాళ్లు** = (తేలికయైన కిరట్టిచెప్పులు)

**అగవు** = (చిక్కటి) చూ, ౫ అక్కుఱు

**అగసాట్లమారి** = చూ, అగచాట్లపోతు.

**అగసాలి** } (కంసాలి - బంగారుపని చేయువాడు)
**అగసాలె** }
ఓజ, కంసాలవాఁడు, కంసాలి, కమసాలవాఁడు, కమసాలెవాఁడు, కమ్మటీఁడు, కొమ్ముకాఁడు తట్రివాఁడు, పటకారుడు, పారసి, పొన్నారి, సొన్నారి.

**అగసి** = (అవిసిచెట్టు) అగిసియ, అగిసె, అవిసి, అవిసియ, అవిసె, నల్లగిసియ, నల్లగిసె, నూనెయగిసె

**అగాదు** = (తుపాకి పేలంగిపోసగు వానియందు నిప్పుం దగిలించుట)

**అగావు** = (తాకట్టు) అడ్డము, తయకట్టు, ఉపాకము, ఈడు ఉద్దనవు, ఉద్దర, ఉద్దరువు, ఎగుడల, ఏప్ప ఋదువ, కోరు, గిరవు, గీవు, తాకట్టు, తేగడ, పెనుప్ర, బందకము బోగ్రిది, రో, రోయి, వాకకము

**అగిసియ** } (అవిసచెట్టు) చూ, అగసి
**అగిసె** }

**అగు** = (అయినట్టి)
౨ - (కలుగు) అగుదెంచు అవు, ఔ, కలుగు, కాఁబడు, కావలయు, పొసరు, పోవు
3 - (కాఁబడు)

**అగున్** = (వల్లె-ఒప్పుకొనుటయందగు పల్కు) అగుఁగాక, అవున్, ఆ, ఔ, ఔను, కానీ, మంచిది, వల్లె, సరి

**అగుఁగదే** = (ఆబ్బురమునం దగునట్టి) చూ ౨, అక్క

**అగుఁగాక** = చూ, అగున్

**అగుఁబొమ్ము** = (నిక్కపుమాట.) ఔను, సరే, సైసరే

**అగుదెంచు** = చూ, ౨, అగు

**అగుర** } (అబ్బురమునందు కుండి) చూ, ౨, అక్క
**అగురా** }

**అగురు** (ఒక దినుసు కడ్డి) అవురు, ఔవు

**అగులు** = (పగులు) ఎడలు, పగులబాఱు, పగులు, పవ్రులు, సౌలు, విచ్చు విరియఁబాఱు, విరియు, వీడియు.
౨ - (రాలు) అవులు, ఉరలు ఉడు, ఒలుకు, ఔలు, కాఱు, కుమ్మరిలు, చిందు, దుల్లు, డొల్లు, పడు, పిప్పిదులు, రాలు, విదురు, విదులు, సడలు, సల్లు

**అగ్గపడు** = చూ, ౧ అగపడు

**అగ్గపాటు** = చూ, అగపాటు

**అగ్గమగు** = (పట్టుబడు)

**అగ్గము** = (కనఁబడునది)
౨ - (లోకువ.) చూ, అంకియు.

**అగ్గలము** = (మిక్కుటము.) ఆగుబ్బు, ఉప్పెనము, ఎలమి ఎసకము, ఏడ్తెఱ, కడిమి, కడ్మ, కలిమి, కల్మి, కొసరు, క్రిందు, గాటము, జగ, జగము, తనరువు, తనర్పు, అలవు, చిటము నవు, నిబ్బరము, సంగారము, పెంపు, పెచ్చు, పెలుచ, పెలుచన, పెల్చు, పెల్చన, పెల్లిదము పెల్లు, పేరిమి పేర్మి, పెట్టు, ప్రీగు, బట్టు బొంపిరి, మిక్కిలి, మిక్కుటము మిటారము, మెండు, మెఱవడి, లావు, వట్టు, వేగిర, వేగిరము, సంపెడ
౨ - (హెచ్చు) చూ, ౪. అంపాంకములు

**అగ్గలించు** = (పెచ్చుపెరుగు) చూ, 3 అదరు.
౨ - (పూను) చూ, ౧ అంగలించు

**అగ్గలిక** = (ఉల్లాసి) అలపోక, ఉబలాటము, ఉల్లి, ఉల్లాసి
౨ :- (వేడుక) చూ, 8 అంగద
3 - (ఒయ్యారము.) ఎమ్మె, ఒయారము, ఒయ్యారము, ఓయారము, కులుకు, కెరలము, గునుపు, గొనపు, గొసబు, చిటికము, చిట్టుటువేతలు, టీవి, టెక్కు, టీవి, టెక్కరము, తెక్కు, నిక్కు, నీటు, పొలుపు, బిటారము, బిత్తరము, బులుపు, బెడఁకు బెడఁగు, బెళఁకు, బెళఁగు, మస, మిటారము, మిటారింపు, మురిపెము, మురువు, లలి, వగ, వెళకు, వెనుకు సొగసు, హాళి హొయలు, హొరంగు, హొరఁగు.

౪ - (పగటిమి) అగ్గలికము, అఱుము, ఇలువడి, ఉక్కు, ఏక్రైలు, కడిది, కడిమి, కణ్కి, కడుదు, కఱుకు, గట్టి, గురుసు, గోహారి, చుఱుకు, డాక, దండి, నెజే, ప్రాపు, పొంపు, పొనపు, పోటు, ఓగువు, బీరము, మగటిమి, మగపాటె, మగపాడి, ముజే, మొక్కలము, మొగ్గలము, వడి, వడిగలతనము, వాడి, వాడిమి, వాని, విడి, వీక, వీకు, సోన, సోమము.

౫ :- (హెచ్చు) అడరు, ఉబ్బకము, ఎక్కుడు, ఎక్కుక, ఎగుక, ఎచ్చు, ఎగ, ఏపు, కడిమి, కడ్కి, దళము, పంతు, పెక్కువ, పెనుపు, పెలుచ, పెలుచన, పెల్చు, పెల్చన, పెల్లు, మలపు, మించు, మించువల, మెండు, మేలిమి, మేలుచేయి, ప్రొగ్గు, వలదు, వాసి, హెచ్చు.

అగ్గలికము = (మగటిమి) చూ, ౪. అగ్గలిక.

అగ్గి = నిప్పు

అగ్గించు = (కొనియాడు.) కైవారముచేయు, కొండాడు కొనియాడు, పేరుకొను, పేర్కొను, పొగడు, పొవడు.

అగ్గింపు = (కొనియాడుట.) అడుగుకోలు, అకలింపు ఉగ్గడింపు, కయివారము, కైవారము, కొసరు, గడన, పొగడిక, పొగడికోలు, పొగడిత, పొగడు, పొగడుట, పొగడ్త, పొవడు, బడాయి, మెచ్చు, మెప్పు.

అగ్గువ = (వెలతక్కువ) చవుక, చౌక, నయము, రాయితి

అగ్గెడన్ / అచటన్ } చూ, అంపిన్,

అచటు = చూ, ౧. అక్కడ.

అచాటము = (విరివియైనది)

అచోటు = చూ, ౧. అక్కడ.

అచ్చ = (అచ్చము.)

అచ్చగుండ్లపేరు = (ముత్యాలపేరు)
౨ - (తెల్ల రాళ్ల కోవ)

అచ్చటన్ = చూ, అంపన్.

అచ్చటు = చూ, ౧ అక్కడ

అచ్చన = (ఆడుపడుచు లాడుకొను కాయ.)

అచ్చనగండ్లు / అచ్చనగల్లు } (పిల్లలాడుకొను నొక యాట) చూ, అంజి.
అచ్చనగండ్లు, ఒడ్డుగుండ్లు.
౨ - అచ్చనగండ్లాడెడు చిన్న చిన్న గుండుతాళ్లు.)

అచ్చనగాయలు = (పిల్లలాడుకొను నొక యాట.) చూ, అంజి

అచ్చనగుండ్లు = చూ, ౨ అచ్చనగండ్లు.
౨ - (అచ్చనగండ్లాట)

అచ్చనలు = (పిల్లలాడుకొను నొక యాట.) చూ, అంజి

అచ్చము .- (తెలుపు) తెల, తెలి, తెలివి, తెలుపు, తెల్ల, తెల్లదనము, తెల్లన, పలుక. పలుకన, పల్కన, వెలది, వెలి, వెలుక, వెలువెల్ల, వెల్ల, వెల్లన, వెల్లి.
౨ .- (తేరినది) అచ్చికము, తేరినది, వెలది.
3 - (అంత)
౪ - (పట్టము) ఈఱవి, ఈఱము, కద్దుము, ఎగ్గడము, కలికి, కాఱు, గాటము, గుబురు, గుమురు, గెంటెము, చిక్కదనము, చిక్కన, జేబు, దట్టము, దడము, దప్పము, దళము, నిద్దము, నెగ్గడము, పొంపిరి, బవరి, బవిరి, మందము మెదుక, మొల్లమి, మొల్లము
౫ - (అచ్చ)

అచ్చలము = (తింపెరము) చూ, ౨ అంకపొంకములు
౨ - (వేడుక) చూ, 3 అంగద

అచ్చలించు = (కినుక చెందు) అలుగు, ఈసడించు, ఎఱగొన, ఎఱ్ఱవాఱు, కటకటంబడు, కసలు, కనారిలు, కాగు, కింకిరిపడు, కినియు, కినుకడు, కిన్వడు, కెరలు, కొఱకొఱలాడు, క్రాగు, గాసిలు, గాసిల్లు, చిఱ్ఱుముఱ, రవురు, రపెర, రనుకు, రొంపు

అచ్చాళి / అచ్చాళు } (జడబాటములేనివాడు)
౨ - (బాదరబందీ లేకుంట)

అచ్చిక = (కొఱత.) అచ్చికము, అరవాయి, అఱ, అఱగొఱ, ఒచ్చెము, కడమ, కీఱ, కుందు, కొంచియము, కొంచెము, కొఱ, కొదవ, కొదుక, కొఱ, కొఱత, గఱగొఱ, గుజీకొండి, చవుక, చౌక, డందు, తక్కు,

తక్కువ, తక్కువు, తగ్గు, తగ్గుదల, దిగుడు, దిగువాయి, దిగ్గుడు, నిముకిళ్ళు, నలుసు, పొచ్చెము, బెరికె, మట్టము, మట్టు, మఱుప, ముల్పు, మొఱికి, లులి, లొచ్చు, లొజ్జు, లోటుక, విన్నన, వెలితి, వెల్తి, సొద్దు.

**అచ్చికబుచ్చిక** = (కలుపుగోలుతనము) అచ్చికబుచ్చికము, కలగలుపు, కలుపుగోలు, కల్పుగోలు, కలుపుగోలుతనము, పొందు

**అచ్చికబుచ్చికము** = చూ, అచ్చికబుచ్చిక

౨ - అచ్చికము, బెల్లంపుమాట, మంచి.

**అచ్చికము** = చూ, ౨. అచ్చికబుచ్చికము.

౨ - (తక్కువ) చూ, అచ్చిక.

౩ :- చూ, ౨ అచ్చము.

**అచ్చివచ్చు** = ( అయివచ్చు ) అయివచ్చు, ఐవచ్చు, మేలైవచ్చు.

**అచ్చు** = (బెల్లము ) చెఱకుడేము, బెల్లము,

౨ ·- (నీడ )

౩ = (మాదిరి ) చూ, ౧, అంగము

౪ - (మొహరు) చప్పు, ముద్ద, మొహరు

౫ .- (సాలెవాని యొక పనిముట్టు )

౬ - చూ, ౫ అచ్చము.

౭ - (అప్పావడు )

౮ - (ఇచ్చు ) ఇచ్చు, ఇడు, ఒసగు, ఒసవు, గోటు, పుడుకు, పుణుకు, పెట్టు.

౯ - (దండుగిచ్చు )

**అచ్చుకట్టు** = (ఏర్పఱచు ) ఏర్చు

౨ - (మడిమడిగా \ నిమతీయు )

**అచ్చుకుప్ప** = (ఆస్తికాడు ) ఆస్తికాడు, కలవాడు, గుజాతి, విడిముడిగలాడు

**అచ్చుకొను** = (తానియ్యవలసిన సొమ్ము మొదలగువాని నొప్పుకొని యిచ్చు )

**అచ్చుగూటము** = (అచ్చువేయు మఱుగల యిల్లు )

**అచ్చుటెద్దు** = (అచ్చువేసి విడిచిన యెద్దు) ఆబోతు, గిబ్బ, బసవడు, బసవన, బసవన్న, మలవిలుకానితేరు, ముక్కంటిమావు, ఋూపుసముగలయెద్దు, ఱంకెలేడు పెకము.

**అచ్చుట** - (నమ్ముట. )

**అచ్చుదల** = (అప్పు ) అప్పు, అప్పువల, అరవడి, తంటు, తంటా, బాకి, రవడి.

౨ - (అచ్చిసచ్చుట).

**అచ్చువనొడిచినట్లుండు** = (సరిగా నుండు.)

**అచ్చుపడు** = (ఏర్పడు.) ఏరుపడు, ఏర్పడు, తెలియు, తేటపడు, తేరకొను, తేఱు, పసగు, పుతపుతపోవు, వీడు.

**అచ్చుపాటు** = (ఏర్పాటు - అచ్చుపడుట.)

**అచ్చెరియము** = చూ, ౧ అక్కజము

**అచ్చెరుపడు** = చూ, అక్కజపడు.

**అచ్చెరుపాటు** }
**అచ్చెరువు** } (అచ్చెరుపడుట.) చూ, ౧. అక్కజము.

**అచ్చెరువుపడు** = చూ, అక్కజపడు.

**అచ్చెరువుపాటు** = చూ, ౧ అక్కజము.

**అచ్చోటు** = (అచోటు ) చూ, ౧ అక్కడ.

౨ - (అనుకుతి) అచ్చోటు, ఒడికట్టు, కచ్చు, కరి, దుబ్బు, దూసె, ౦ంకు, పాపలగున్యావు, బుత్త, బుయ్య, బుయి, మనునిల్లు సందు.

**అచ్చొత్తు** = (అచ్చువేయు

**అచ్చోటు** = (అచోటు ) చూ, ౧ అక్కడ.

౨ - (అనుగుతి ) చూ, ౨. అచ్చోటు.

**అజారము** = ( మొగసాల ) ఎతరు, మొగలివాకిలి, మొగసల, మొగసాల, మోసల, మోసాల, హజారము, హజాఱము, హోజాఱము.

౨ - (కొలువుకూటము) చూ, ౩. అంగడి.

**అజ్జ** = (తటి.) చూ, ౧ అంక

౨ - (అడుగు.) చూ, ౧ అండ

౩ - (బళీ - మెచ్చుటయందగునది.)

అజ్జరె, అజ్జరే, అజ్జా, అజ్జారె, అజ్జారే, అద్దిటే, అద్దిటియ్యా, అద్దెఱ, అరె, అరే, అసాదు, ఆరె, ఎ, ఏ, ఓహో, ఓహోరె, ఓహోకే, ఔర్, నాంగుబళీ, బాగు, బాగురె, బాగురే, పురె, పురే, బలా, బలారా,

జడియు, జవ్వాడు, తపిపిలాడు, తపఁబడు, తత్తఱించు, తత్తఱిలు, తత్తఱిల్లు, తమకించు, తపన, తఱలు, తలఁకించు, తలఁకు, తలడించు, తలడిల్లు, తలరు, తల్లడకుడుచు, తల్లడపడు, తల్లడీలు, తల్లడిల్లు, తల్లడించు, తుంపెసలాడు, తుంపెసలుగునియు, తుప్పలుమాలు, తూఁగాడు, తూఁగియాడు, తూఁగు, తూలఁబాఱు, తూలాడు, తూలియాడు, తూలు, తెమలు, తొడిఁబడు, తొనఁకు, తొలఁకాడు, తొలఁకు, నట్టాడు, నడయాఁడు, పంకించు, పదరు, పల్లటిలు, పల్లటిల్లు బిత్తరపోవు, బిత్తరించు, బెగ్గిలు, బెగ్గిల్లు, బెదఁకు, బెణఁకు, బెళఁకు, మిడుఁకు, మిసుఁకు, వడఁకు, వణఁకు, వీఁగియాడు, వీఁగు వెఱగుపడు, సుడివడు, సురుఁగు.

౨ - (కనుఁబ్రామి) అపకించు, ఊటించు, కనుఁబ్రాము, కనుమూయు, కనుమొఱఁగు, కన్నుమొఱఁగు, కన్నొఱఁగు, కపరించు కపురుపెట్టు, కపురువాడుము, కవ్వరించు, కవ్వరువెట్టు గినమాడు, చిక్కఁజేయు, చొక్కడు, జూటాడు, తక్కు, తటుకుటించు, తటుకటు చేయు, దాఁగురించు, పండించు, ఒక్కు, బెల్లించు, బొంకుపుచ్చు బొంకించు, మొఱఁగు మోసపుచ్చు, మ్రిచ్చిలు, వెళ్లువెట్టు

3 - (దొంగిలించు) చూ, ౪ అంకించు

**అటమటింపు** = చూ, ౧ అటుకటు

**అటమటీఁడు** = చూ, అటుకటుకాఁడు.

**అటమర** = (వమ్ము) చూ, ౫. అటుకటు.

౨ - (పారిపోవుట) అటుమరింపు.

**అటమరింపు** = చూ, ౨ అటుకర.

**అటి** = (అటువంటి) అటువంటి, అట్టి.

**అటిక** = (చిన్నకుండ) అట్టిక, ఎసల, దుట్టి

**అటికమామిడి** = చూ, అటుకమామిడి.

**అటు** = (ఆలాగున) అటులన్, అటులు, అట్టు, అట్టులన్, అట్టులు, అట్టువోలెన్, అట్లు

౨ - (అప్పటికి)

**అటుక** = చూ, అటుకు.

**అటుకులు** = (వడ్లను దంపి చేసినవి) అటుకులు.

**అటులన్**
**అటులు** } చూ, అటు.

**అటువంటి** = (అట్టి) చూ, అటి.

**అటువలె** = (అట్లు)

**అటె** = (అబ్బురమునంవగునది) చూ, ౨. అక్క.

౨ - (వంతనుదెలిపెడి.) అట్టె.

3 - (అనుమరఁదెలిపెడి.) చూ, అకో.

౪ - (అనుదాని నడుగుటను దెలిపెడి.)

**అట్ట** = (తోలు) చూ, ౧. అంటు.

౨ - (తలతెగిన మేను.) మొండెము, మొండియము, మొండె, మొండెము, మొట్టె

3 - చెప్పులకొఱకుఁ జక్కఁగఁ బఱపఁబడిన తోలుముక్క.)

**అట్టచెమ్మ** = (నాలుగు గవ్వలతో నాడెడు దాయమువంటి యొక యాట )

**అట్టడి** = (ఆలముకొఱవ చంకమీఁదఁగాని కొక్కెమ మీఁదఁగాని యేర్పఱచిన గది.) అట్టెడి, అత్తోటము.

**అట్టి** = చూ, అటి

**అట్టిక** = చూ, అటిక.

**అట్టీఁడు** = (అట్టివాఁడు ) అట్టివాఁడు. అట్టీఁడు.

**అట్టియ** = (గుంపు ) చూ, అంచలు.

**అట్టివాఁడు**
**అట్టీఁడు** } చూ, అట్టీఁడు

**అట్టిది** = (అటువంటిది.)

**అట్టిరగుట** = (అట్టివారగుట )

**అట్టు** = (ఒకానొక పిండివంట ) దోసియ, దోసె.

౨ - (ఆలాగున ) చూ, అటు.

**అట్టుక** = చూ, అటుక.

**అట్టుప్ప** = చూ, అంటుప్ప

**అట్టులన్**
**అట్టులు** } (ఆలాగున.) చూ, అటు

**అట్టువ** = చూ, అటుక

**అట్టువోలెన్** = (అలాగు) చూ, అటు.

**అట్టె** = చూ, అటె.

**అట్టెడ** = (తూమెడు గింజలు పట్టెడు గోనె) కంచియ, వంచె.

౨ - (కంతెన.)

3 - (పూడిక యెత్తుటకు యీఁతబిద్దలులోనగువానితో నల్లిన తట్ట)

౪ - (నెరసులు పోఁగొట్టుటకై కూర్చిన జల్లెడవంటితడిక)

౫ - పెసలు లోనగువానియందలి మట్టిగడ్డలు మొదలగు వాని వెలువరించుటకుఁ గట్టిన గోఁగు కట్టెలు లోనగు వాని మోపు.

**అట్టెడి** = చూ, అట్టడి

**అట్లు** = (అలాగున.) చూ, అటు

**అల్లొట్లు** = (వాన వెలిసిన పిమ్మట చూరునుండి పడు నీరుబొట్టు) నట్లొట్లు, బొట్టులు, వంగుట్లు

**అడ** = (ముద్ద) అడపక, కరుడు, దొబ్బ, పిండలి, పిడచ, పిసుచ, ముద్ద, సరుకడము.

౨ - (రూపు) ఉరువు, నిలువు, రూపు

**అడకత్తు** }
**అడకత్తెర** } (పోఁకచెక్కలు కత్తిరించు కత్తెర)

అడకొత్తు, అకొత్తు, పోఁకొత్తు

**అడకము** = (లోపల సణఁగినది) ఇమిడిక, ఈలు.

**అడకర** = (ఓర్పు - తాలిమి) ఓపిక, ఓపు, ఓరిమి, ఓరుపు, ఓర్పు, తాలిమి, తాల్మి, తాలిక, తాలివి, నిమ్మళము, నిమ్మళి, నెమ్మది, మెత్తన, సయిఁపు సయిఁపుడు, సయిరణ, సైఁపు, సైఁపుడు, సైరణ.

**అడకించు** = (వెక్కిరించు) అణకించు, అదిగొను, కేరు, కేరిడిసేయు, కేరిణిసేయు, గుంజనుగుగు, గేలికొట్టు, గేలికొను, ఎక్కిలించు, తప్పనసేయు, నవ్వుపిసాళించు, మేలమాడు, వెక్కిరించు, పర్యాటించు.

౨ - (మోసపుచ్చు.) చూ, ౨. అటమటించు.

**అడఁకువ** = (అణఁకువ, వంగియుండుట) అణఁకువ, అణుఁకువ, అణుకువ, డింద, వంపట, మడుఁగు, మడువు, మగ్గు, మణుఁగు, మణువు.

**అడకొత్తు** = చూ అడకత్తు.

**అడఁగఁగొట్టు** = (కుగ్రింగించు - తుగ్రింగించు.

**అడఁగారు** = (ఊఁటుడిల్లు) అడఁగు, అణఁగారు, అణఁగు, అఁగు. అఱు, ఇంచు, ఇముడు, ఉంకు, ఊటుడిల్లు, ఊటుడు, కుందు, కుదియు, కుగ్రింగు, చల్లారు, డయ్యు, డిందు, డిందుపడు, డిగఁబడు, డొంకు, తగ్గు, తాఱు, తీలగు, తీలుపడు, తూలు, తేఱు, దిగఁబడు, పొనుపడు, పొస్పడు, పొలివోవు, మట్టుపడు, మడుఁగు, మడువు, మగ్గు, మణుఁగు, మణువు, మలుగు, ముడుఁగు, మనుఁగు, మున్గు, ముప్పటిలు, లోఁగు, లోవు, వారు, మొగ్గు, సగ్గు, సమయము, స్రగ్గు, సుగ్రుక్కు.

**అడఁగు** = చూ, అడఁగారు.

౨ - (తగ్గు) అణఁగు, ఊరఁబోవు, ఎత్తువోవు, కడఁబడు, కుంటుపడు, కుందు, కుదియు, కుఱుచపడు, డిగు, డుంకు, తీయు, పిరిదులు, వంపటిలు, మందటిల్లు, మడుగు, వట్రిపడు వ్రాలు, సగ్గు, స్రగ్గు సుగ్రుక్కు.

3 - (వంగు) అణఁగు మడఁగు, మడుఁగు, మడువు, మగ్గు వణఁగు మణుఁగు, మణువు, మొగ్గఁబడు, వంగు, వాలు.

౪ - (చెడు) అణఁగు, అణుఁగుపడు, అఱు, అఱుగుపడు, అవియు, అఱు, ఎత్తువోవు, ఏడు, కడచను, కడచు, కడతేఱు, కడివోవు, కుంటుపడు, కోలుపడు, కోలుపోవు, కోల్పడు, గిట్ట చెడు, తీఱు, తీఱుపడు, తోడుతోవు, తుగ్రింగు, తుగ్రింగుడుపడు, నలఁగు నాసిరిల్లు, పరియు, పటిపోవు పొడపడఁగు పొనుగుపడు, పొలియు, పొలివోవు, పోకాడు, పోవు, బుసివోవు, బుగ్రింగు, మచ్చమాయు, మలుగు, మాయు, మాఱు మాలు, ముక్కు, మునుఁగు, మున్గు, ముసించు, మూరిఁబోవు, రూపుసెడు, సమయు, సరిపోవు, సరియుగు.

౫ - (లోఁపడు) అణఁగు, లొట్టపోవు

**అడఁగుబొద్దు** = (వేలుదారి లోపల సణఁగియుండునట్లు గోడ యరచులయందు కీఱు యేర్పఱచెడు బొద్దు)

**అడగొను** = (ముద్దుకట్టు)

**అడగోలుకొను** = (దొంగిలించు) చూ, ౪ అంకించు

**అడచిపాటు** = (వడి) చూ, ౧ అంకెపొంకములు.

**అడచిపడుట** = (తుళ్లిపడుట)

**అడంచు** = (అడంగఁజేయు) అణంచు

**అడజడి** = (బాము) చూ, ౮. అంగద

**అడజడిపెట్టు** = (జాలిఁబెట్టు) ఏపతించు, జాలిబెట్టు

**అడతెంచుట** = (అరుదెంచుట)

**అడదడి** = (ఏలుబడి)

**అడది** – (పసుపు) అరిది, అళేఁది, చిక్కసము, పచ్చ, పచ్చఁదనము, పచ్చన, పసుపు, పసరు, ఎసిరిక, పసుపు పాళేఁది.

**అడప** = (గొడ్లకుఁ గాలిగిట్టలకుఁ గలుగు జబ్బు) అడుప, గొరిసెగాలి.

౨ – అడప ముంచుకొనియుండు ఆఁడుది) అడపకత్తియ, అడపకత్తె

**అడపకత్తియ** } చూ, ౨. అడప.
**అడపకత్తె** }

**అడపకాఁడు** = (అడపముంచుకొని యుండువాఁడు)

**అడపట్టె** = (పొలములో విత్తనములు విత్తి మిట్టపల్లములు సరియగుటకై యెడ్లను కట్టి తోలెడు మ్రాను. అడ్డపట్టియ, పడ్డపట్టె, అడ్డమాను

**అడపము** = (తమలపాకులుంచుకొను తట్ట) ఆకుసంబెళ, పదరము, వట్రిము, సంబళిక, సంబెళ, హడపము.

౨ – (మంగలితిత్తి) కైపాల, పొది, హడపము.

**అడపర** = (ముద్ద) చూ, ౧. అడ

**అడపుట** = (పట్టుట)

**అడపొడ** = (అడుగుల గుఱుతు) జాడ

**అడరించు** = (అమ్మును విడుచు) అడరుచు, అడర్చు.

**అడరు** = (హెచ్చు) చూ, ౫ అగ్గలిక.

౨ - (ఇబ్బంది) చూ ౧ అగచాటు

౩ - (ఒప్పు) అమరు, అలరారు, అలరు ఆరు, ఎనయు, ఎలరారు, ఎసఁగు, ఒనరు, ఒప్పారు, ఒప్పు, కొఱలు, క్రాలు, చను, చెలఁగు తగు, తనరు, తనరుచు, తనర్చు, తలరు, తుఱఁగలించు, పరఁగు, పొనరారు, పొనరు, పొలుచు, పొలుపారు, పొల్పారు, పొసఁగు, పోలు, మెలయు, మొనయు, రహించు, రాణించు, సఱలు, వెలయు, సవరిల్లు

౪ - (అంటుట నలముకొను) అల్లిమిల్లు, అలుక్రమ్ము అలము, అలముకొను, ఒడువు, ఒలయు, కడలుకొను, కడలొత్తు, కడల్కొను, కప్పు, కప్పుదంచు, కమియు, కలగొను, కవిచేయు, కవియు, కవియుదెంచు, క్రమ్ము, గుడికొను, చిందు చిట్టాడు చిలుకు, చెరలాడు, జీరువాఱు, డీకొను, తఱుము తారసించు, తారసిలు, తారసిల్లు, తిప్పుకట్టు, తిప్పులుగట్టు, తీఁగలువాఱు, తొట్టు, తొట్టుకొను, త్రోచు, దీకొను, నిగిడారు, నిగుడు, నివ్వటిలు నివ్వటిల్లు, నూలుకొను, నూల్కొను, నెరయు, నెఱయు, పంచారించు, పటువణించు, పయికొను, పయిపడు, పరఁగు, పరవు, పర్వు, పఱఁగు, పాఱు, పిక్కటిలు, పిక్కటిల్లు, పిసాళించు, పురికొను, పైకొను, పైపడు, పొంపిరివోవు, పొదుగు, పొలయు, ప్రబ్బు, బలకరించు, బుగులుకొను, బెరయు, బెలయు, నట్టాడు, మలయు, ముసురు, ముసురుకవియు, ముసురుకొను, మూఁగఁబాఱు, మూఁగు, మొగిచాగు, ఉంపిలు ఉంపిల్లు, లాఁచు, వఱలు, విజ్జు, విరియఁబాఱు, వెదచిందు, వెలివిరియు, వెల్లివిరియు, సందుకొను, సోమించు

౫ - (పెంపగు- హెచ్చగు) ఈడేఱు, ఎచ్చరిలు, ఎచ్చెఱు, ఎదుగు, ఏచు, ఒదలు, కెరలువోడుచు, కొనలిడు, కొనలొత్తు, కొనసాగు, కోలుకొను, కోల్కొను, తలయెత్తు, తీఁగసాఁగు, తొంగలించు, నిక్కు, నెగడు, నెవడు, పిక్కటిలు, పిక్కటిల్లు, పురడించు, పురణించు, పురాణించు, పురాయించు, పెంపగు, పెనుపడు, పెరుఁగు, పెరువు, పెగ్గు, పెయ్యు, పొంపిరివోవు, పొటకరించు, పొదుగు, పొదలాడు, పొదలు, పొదలుకొను, ప్రబ్బు, మించు, మీఱు, ముదురు, మూరిఁబోవు, రక్కొను, రహించు, రూపగు, రెక్కొను, రేకెత్తు, ఉంపిలు ఉంపిల్లు, తీడు, సరగు, హెచ్చరించు, హెచ్చరిలు, హెచ్చరిల్లు, హెచ్చిలు, హెచ్చిల్లు.

. (చెలరేఁగు) ఉప్పొంగు, ఉరడించు, ఎసఁగు, ఎసరేఁగు, ఏచు, ఏపారు, ఎసరేఁగు, ఒడరు కమురు, కసిమసఁగు, కరలియాడు కాలు, కాలువోడుచు, కెలయు కేరించు, కొసరు కొప్పరించు, కొసరు, గొదకొను, చిందులుగొను, చిమ్మిరేఁగు చిఱుము, చెంగలించు, చెలరేఁగు, చెలరేఁగు, జృంభించు, తెసరు తెసరుచు, తెసర్చు నిగుడు, నిట్టగ్రిమ్ము నిట్టవోడుచు, ప్రోదించు, పురణించు, పురాణించు, పురాయించు, పెఱుగు, పేరుచు, పేర్చు, పొంగారు, పొంపిరిపోవు, బుగులుకొను, మిటారించు, మూరిఁబోవు మెండుకొను, రెచ్చి రేఁగు, రేయు, ఉంపిలు, ఉంపిల్లు, ఉయు, లాఁతసేయు, లాయు, వీక్కు, సెలయు సోమించు, హవణిల్లు.

(పెంపుమీఱు) అగ్గలించు, అడరుచెంచు, అసలాడు, ఆకుబ్బతిలు, ఆకుబ్బుకొను, ఉట్టిపడు, ఉబ్బరించు, ఎకదొట్టు, ఎక్కు, ఎలరారు, ఎలరుచు, ఎలర్చు, ఎసఁగు, ఎసరు, ఎసరారు, ఎసవు ఏచు, ఏపారు ఏసరు, ఒడ్డగిల్లు, కడలుకొను, కడుకొను, కదుకొను, కదురు, కరలు, కొదరు, కొప్పరించు, క్రిందుకొను, క్రిక్కిరుబ్బు, గడ్డుకొను, గుదికొను, గుబ్బతిల్లు, గురువులువాఱు, గొదకొను, చిలుకు, చెంగలించు, జడిగొను, తనరారు, తనరు, తనరుచు, తనర్చు తలిరుచు, తలిర్చు, తుఱంగ లించు, తుఱంగలిగొను, తొంగలించు, తొట్టగిలు, తొట్ట గిల్లు, తొలఁకాడు తొలఁకు తొరిగు, దయివాఱు, దుద్దెక్కు, దైవాఱు నసుచు, నిక్కు నిబ్బరించు, నిక్కటిలు, నిక్కటిల్లు, నెట్టుకొను, పంచారించు పంబు, పమ్ము పయికొను, పలుపడు, పిక్కటిలు, పిక్కటిల్లు, పిచ్చలించు పెంపుమీఱు, పెనుపడు, పెల్లుకొను, పేరు, పేరుచు, పేర్చు, పైకొను, పైపడు, పొంగారు, పొంపిరి వోవు, పొటకరించు, ప్రిబ్బు, బలకాయించు, బలగొను, బలుపుకొను, బల్పుకొను, బొంపిరిపోవు మల్లడించు, మించు, మిక్కిలు, మిగులు, మిటారించు, మీఱు, ముడివడు, ముమ్మరించు, మురియఁబడు, ములుసూపు, మూరిఁబోవు, మూఁగు, మెండుకొను, మేటిల్లు, ఉంపిలు, ఉంపిల్లు, ఉయు, వాలు, వ్రాలు, సంపడించు, సందడిల్లు, సరికడచు.

౮ - (పూను) చూ, ౧ అంగలించు.

౯.- (కలుగు - పుట్టు) అత్తు, ఆవతిల్లు, ఆరు, ఉప్పతిల్లు, ఊరు, ఎలయు, ఒట్టు. ఒదవు, ఒనరు, ఒలయు, ఒదవు, కదురు, కలుగు, కలువు, కూరు, గండలించు, చెందు, తెట్ట తనరు, తలకొను, తలకొనుచెంచు, తేరు, తేఱు, తేలువాఱు, తొట్టగిలు, తొట్టగిల్లు, తొడరు, తొరలు, తొలకరించు, తొల్కరించు, దొరయు, నిక్కటిలు, నిక్కటిల్లు, పట్టు పనుగొను, పనుపడు, పన్ను, పన్ను పడు, పయికొను, పాటిలు, పాటిల్లు, పుట్టు, పైకొను, పొంపిరివోవు, పొలుచు, పొడతెంచు, పొడము, పొడమ్ము, పొరయు, పోయు, బెరయు, ముడివడు, మూఁడు, మెయికొను, మేకొను, మొనయు, మొలతెంచు, రెక్కొను, రెక్కొను, హత్తు

౧౦.- (తొందఱపడు) చూ, ౨. అగడుపడు

**అడచుచు**
**అడర్చు** } చూ, అడరించు.

**అడరుచెంచు** = (పెంపుమీఱు) చూ, ౭ అడరు

**అడలఁగొట్టు** = (అదరునట్లుచేయు)

**అడలించు** = (గద్దించు) అదరించు, కంరు, గదుము, గదుముకొను, గద్దించు.

**అడలు** = (వగపు) అదవద, ఆలమట, కలవరము, తలఁపు, తలపోఁత, వగ, వగపు

౨ - (దిగులు) చూ, అంజిక

3 - (వగ) అలఁత, ఉమ్మ, ఉమ్మలము, ఉమ్మలిక, ఉమ్మలికము, కనికరము, కస్తి, కందు, కుతి, కుతిలము, చుమ్మ, చూకురు, జాలి, వగ, వగపు, వసట, గ్రుక్కు.

౪ - (గాసి) చూ, ౮. అంగద,

౫ - (ఏడ్చు) అఱచు, ఏడుచు, ఏడ్చు కనికరించు, కూపెట్టు, మొఱయిడు, వగచు, వాచఱచు, వాపోవు.

౬.- (వసరు) అఱచు, ఒఱలు, క్రిందు, ఓలు, వసరు.

౭ - (మరపిల్లు) అడలుకొను, అలఁగు, ఉమ్మలించు, ఉమ్మలికించు, కనికరించు, కుఁగు, చూకురుపడు, దుగ పిల్లు, పేరిముడించు, ముచ్చిరు, వగచు, వసరు.

౮ - (బెగులుకొను) చూ, అంజు.

**అడలుకొను** = చూ, ౭ అడలు.

**అడవి** = (కాన) ఎడారి, ఎడారు, కాడు, కాన, కారు, కోన, చేను, పొలము, లొంక

**అడవికంద** = (ఒకదినుసు కందగడ్డ)

**అడవికాఁకర** = (ఒకదినుసు కాఁకర) ఆఁగాఁకర, మట్టుకాఁకర

**అడవికాఁపు** = (అడవియందు కాఁపురమున్నవాఁడు) అడవినెలవరి, అడవినెలవు, అడవిమనికిపట్టు జడదారి, జడలదారి.

**అడవికిక్కస** = (ఒకానొక చెట్టు)

**అడవికుక్క** – (తోఁడేలు) గొఱియలసూఁడు తోఁడేలు, తోఁడేలు, తోఁడేలువు, మేఁకతిండి.

**అడవికోడి** = (కారుకోడి) కానపుంజు, కారుకోడి, గునపనకోడి, పాడకోడి

**అడవిగెనసు** = (ఒకదినుసు గడ్డ)

**అడవిచెఱకు** = (కారుచెఱకు)

**అడవిచేమ** = (ఒకదినుసు చేమ)

**అడవితిరుగుడు** = (కోఁతి) ఆడవినట్టు, ఎక్కిరింతమెకము, కొండత్రిమ్మరి, కొమ్మచెంకిమెకము, కొమ్మత్రిమ్మరి, కొమ్మదాఁటుమెకము, కొమ్మమెకము, కోఁతి, కోనత్రిమ్మరి, కోనవనికి, క్రోఁతి, గట్టుఁదిమ్మరి, చెట్టుఁదిమ్మరి, చెట్టునట్టు, తఱులమెకము, తఱులమోగమెకము, తిప్పత్రిమ్మరి, తిమ్మఁడు, నేలపట్టిమగనిబంట, మలమనికి, మలవనిక్క పల్లమ్రాను దిమ్మరి, మ్రానుమనికి, మ్రాన్దిమ్మరి, మ్రాన్మనికి, వెకిరింత

**అడవితొగరి** = (ఒకానొక చెట్టు)

**అడవిదున్న** = (కారెనపోతు) కారుపోతు, కారెనుపోతు, కాఱుదున్న, కాఱుపోతు, కాఱెనుఁబోతు

**అడవిదోమ** = (ఒకదినుసు దోమ)

**అడవినట్టు** = (కోఁతి) చూ, అడవితిరుగుడు.

**అడవినువ్వులు** = (ఒకదినుసు నువ్వులు)

**అడవినెలవరి**
**అడవినెలవు** } (చూ, అడవికాఁపు)

**అడవిపంది** = (కారుపంది) ఏతిలము, బంటుమెకము. మొత్తెమెకము, మోటుబారుమెకము, మోటుమెకము, మోటువారమెకము, రోఁజంటలి, లోబంటరి, వాలుమెకము, వేల్పుమిత్తి, సలుగు

**అడవిపుట్టువు** = (వెల్లయేనుఁగు.) చదలయేన్గ, జాల్పుట్టువు, తెల్లయేనుఁగు, నీరుపుట్టువు, నబ్బురూపరి, వెలిగారు, వెల్లగారు, నేగంటియెక్కుడు, వేలుపులగారు.

**అడవిపెసలు** = (ఒకదినుసు పెసలు)

**అడవిప్రత్తి** = (అడవిలోఁబండెడు ప్రత్తి)

**అడవిబచ్చలి** = (ఒకదినుసు బచ్చలి)

**అడవిబీఱ** = (ఒకదినుసు బీఱ) ఆనప, ఊరబీఱ, కార్బీఱ, చేఁదుబీఱ, వెట్టిబీఱ.

**అడవిమనికిపట్టు** = చూ, అడవికాఁపు.

**అడవిమామిడి** = (ఒకదినుసు మామిడిచెట్టు)

**అడవిమామెన** = (ఒకానొక చెట్టు)

**అడవిమునగ** = (ఒకదినుసు మునగచెట్టు.)

**అడవిమేఁక** = (ఒకానొక మేఁక) ఇసుదలతేజి, ఏడిక, తగరము, తగరు పొటేలు, పొట్టేలు, పొట్టేలు, మేఁటి

**అడవియఁగు** = (నమ్మగు)

**అడవియులవలు** = (ఒకదినుసు ఉలవలు)

**అడవిసదాప** = (ఒకానొక చెట్టు)

**అడవీఁగ** = (ఒకదినుసు యీఁగ)

**అడసాల** = (వంటయిల్లు) పాకసము, బానసము, బోనపుటిల్లు, వల్లసాల, వంటకొట్టము, వంటయిల్లు, వంటసాల, వంటిల్లు, సువారంపుటిల్లు

**అడి** = (ఎచ్చు) చూ, ౮. అంకపాంకములు.

౨ - (వమ్ము) చూ, అటుమటు.

**అడిగండ్లు** = (గలువఁగా నడుగున నిలిచిన ఱాళ్లు)

**అడిగము** = (ఎడ్లమీఁదివేయు కంట్లములలోని వేఁడము)

**అడిగట్టలు** = (పావకోళ్లు.) అడియొత్తులు, గొడుగుపావలు, పాఁకోడు, పాగలు, పాగాలు, పావకోళ్లు, పావలు, పావాలు, పావుకోళ్లు, మెట్టులు, సంబవులు, సంబాళిగలు, సమ్మాళిగలు

**అడిగికొనుట** / **అడిగికోలు** } (ఒకరిని చెయిచాఁచి యడిగికొనుట )

**అడిగినంతనొసఁగెడియావు** = (వేల్పుగిడ్డి) ఈవులమొదవు, ఎవలుఁదొడుకు, జేజేగిడ్డి, తెలిమొదవు, తెల్లమొదవు, పాల్కడలికాన్పు, పురుఁదొడుకు, వింటిపసి, వెలికెలఁబడుఁదొడుకు, వెలిగిడ్డి, వేలుపుగిడ్డి, వేలుపుటావు, వేల్పుగిడి.

**అడిగెండ్లు** = (నూకనుచ్చు)

**అడిగొంటు** / **అడిగొట్టు** } (కూళ)
ఉక్కివుఁడు, ఉలిపి, ఉలిపిగొట్టు, ఏతరి, ఒఱపిడి, కఱటి, కల్లరీఁడు, కూళ, కూళఁడు, గడుసు, గరాసు, గొంటరి, గొంటు, చిలుమువాలు, చెడుగు, చెనఁటి, చెన్నఁటి, టక్కరి, టాటోటు, టాటోటుకాఁడు, తక్కులాఁడు, తులువ, నాలిబూతము, నాలిముచ్చు, పలువ, పిసాళి, పెఱగాయ, ప్రాచీనవిత్తు, బేరజము, మొండికట్టె, మొక్కలి, మొక్కలికాడు, మొక్కలీఁడు, రేవసు, లండ, లండీ, లంజు, లంచుఁబోతు, సుడియ.

**అడిగొంటుతనము** = (నాలిముచ్చుదనము)

**అడిచిపడు** = (తొందఱపడు) చూ, ౨ అగడుపడు
౨ :- (మండిపడు) ఎగసిపడు

**అడిచిపాటు** = (తొందఱ) చూ, ౨ అక్కఱ.

**అడిచెను** = కొట్టెను

**అడితి** = (ఒక బేహారాఁడు మఱియొక డంపెడు సరకుల నమ్మి పరల వానికి సరకులు గొని పంపుటకై వానివద్ద నూటికింతయని పుచ్చుకొనెడి కలుగు )

**అడితాగుడు** = (కఱవు) కఱవు, కాటకము, నిట్టు, నెవ్వ

**అడిదపుమొకము** = ( ఎనిమిది కాళ్లుగల యొక దినుసు మెకము ) ఎనిమిదడుగుల మెకము ఏనుఁగుల గొంగ నూఁడు, చవుగంటి, చౌగంటి, దచ్చికాళ్లమెకము, దచ్చియడుగుల మెకము, మీఁగండ్లమెకము.

**అడిదము** = (కత్తి) అలుగు, కగ్గ, కటారి, కటారు, కత్తి, కత్తియ, కత్తె, కరాచూరి, తరవలి, తెఱవలి, తలిమము, వరాజి, వరాజీ, వారాజి, పట్టియము, పట్టెము, పిరంగి, పేరంగు, వాలు

**అడిబంద** = (తుంటరి) అఱవ, అవదగాకి, ఆకతాయి, కిల్లరి, కిల్లరీఁడు, కొయ్యద్రిప్ప, గరాసు, గుండఁగొయ్య, గొంటు, గోపు, చిలిప, చెట్ట, తిప్పకాయ, తుంట, తుంటరి, తూఁట, తూఁటరి, తూఁడరి, దుండగీఁడు, దుడుకడు, నరకుఁడు, పడిసేటు, పలుగాకి, పలుకు, పలువ, పల్లాకి, పాడెగట్టు, పాపాలముద్ద, పాళి, పొడువ, పొడువడు, పోచకాఁడు, పోలువ, పోలెవాఁడు, ప్రిల్లపికాఁడు, ప్రిల్లవీఁడు, ప్రిల్లదుడు, బండ, బండగుఁడు, బండఁడు, బాకీల్లమారి, రాలుగాయ, వెంబర, సుద్దులమారి.

**అడిబీరము** = (ఏనుఁగు మొదలగువాని మత్తు )
గజ్జు, దిమ్ము, మత్తా, మత్తు మస్తు

**అడియఁడు** = (కాలిబంటు - అడుగు లొత్తువాఁడు )

**అడియరి** = ( బంటు. ) ఊడిగీఁడు, కొలువుకాఁడు, కొలువుడుకాఁడు, కొల్వుడుకాఁడు, జీతగాఁడు, డింగరీఁడు, డింగరుఁడు, పనివాఁడు, ప్రాఁత, బంటు, బానసీఁడు, బోడిక, లెంక, వరవుఁడు
౨ .- (పిసినారి.) ఈలగ్రద్ద, కక్కులితికాఁడు, కోటిక, పిసిడి, పిసినారి, పిసిని, పిసినిగొట్టు, బంకముచ్చు

**అడియాలము** / **అడియాళము** } (ఒచ్చు) చూ, అంకనము

**అడియాస** = (పేరాస )
౨ - (కలుగు ననెడి కోరిక )

**అడియొత్తులు** = చూ, అడిగఱ్ఱలు.

**అడిసాటా** = (తలుగుచేరము)

**అడుకు** = (పేర్చినదొంతి ) దొంతర, దొంతి, దొం, వరుస.
౨ - (గిగులు) చూ, అంకజి

**అడుకులు** = చూ, అటుకులు

**అడుగంటు** = (కట్టు ) ఇంకు, ఇగుర, ఇవురు, ఈఁకు, ఈచు, ఎండు, డిందు, డొందు, దయ్యము, నవయు, బక్కటిల్లు, మక్కు, వట్టు, వడియు
౨ - (ఓయ్యము లోనగునవి వండునపుడు నీళ్లు చాలమిచే మాడిపోవు )

**అడుగంటులు** = (అడుగున నిలిచినవి )

**అడుగు** = చూ, అంజ

౨ - (క్రిందు) అడుగు డిగువ దిగువల, దిగువ, దిగువాటు, పాదు

౩ - (అంజయొక్క కొలఁత) అడుగు

౪ - (కసీసము) అడుగు, ఆసదు కసీసము చీడు చిరిచిబ్రాబ బీడు

౫ - (ఒకరి నడుగు) అడుగు, అడుపు ముడించు

౬ - (వేడుకోన) అడుగుకొను అడుగు వేడు

**అడుగుకొను** = (వేడుకొను)

౨ - (బియ్యములోనగునవి యడుగుకొను)

**అడుగుకోలు** (చూ, అగ్గింపు)

౨ - (లంపెము) ఆటువారము, ఆయువారము, ఆయివారము జోగ్గు జోగు లిరిపము లిరిపెము, లిబిపము, లిటిపెము, లికిరము

**అడుగుచెమ్మటలాఁడు** - (పెరుమాళ్లు) అలకాపురి, అలఁగాపరి, ఇత్తిదాల్పుబావ, ఉత్తకేలులాఁడు ఉత్తకేలువేలుపు ఎవమచ్చులసామి, కపిలియల్లుఁడు కటివేల్పు కత్తినెచ్చెలి, క్రొన్ననవిలుకానితండ్రి గట్టుతాలుపు, గరుడిరవుతు, చుట్టుఁగైదువదోడు చుట్టువాలుదారి, చుట్టువాలుజోదు, తమ్మికంటి, తరిదాలుపు తలిగట్టుదారి, తామరపాక్కలివాఁడు, తెలిదమ్మికంటి తెల్లవిమన్నీఁడు, నలమేనిదొర నల్లయ్య నిడుపఁడుపాన్పుతోఁడు పచ్చవలువదారి పదివేసములసామి పసిఁడిపుట్టముదాల్పు, పాలకడల్లుఁడు పాలమున్నీటియల్లుఁడు, పుట్టుకడుగు పుడమిరా, పులుఁగుతత్తడిరౌతు, పెరుమాళ్లు, పొట్టివడుగు ప్రొద్దుసెలకనదోయి, బూరగొమ్ముతుపాపి, మావమావ, మొసలివాయొంట్లుదాల్పు వలముతాలుపు వెన్నదొంగ, వెన్నుఁడు వేగంకిసైదోడు, వేల్పులమేలువాఁడు, సోమసూర్యలగొంగ

**అడుగుట** = (వేఁడుకోలు) వేఁడికోలు వేఁడుకోలు

౨ - (ఒకదానిని గురించి యడుగుట) ఉదుకు

**అడుగుతాటించు** - (కాళ్లచేఁద్రొక్కు) కాళ్లచేసదఁచు కాళ్లనద్రొక్కు గూటోయు లిన్ను, తాఁచు

**అడుగుపడు** = (క్రిందుపడు)

**అడుగుపుట్టువు** = (మిన్నేఱు)

౨ - (కాఁపువాఁడు) అడుగుఁబుట్టువు, కలపతాల్పు, కాఁపు కాలిపుట్టువు చవుదరి చౌదరి తెలగా, బలిజే, బలిజెవాఁడు, బల్జవాఁడు మనువాఁకతోఁబుట్టువు

**అడుగువాలుపులుఁగు** = చూ, అజ్జవాలు

**అడుచు** = (కొట్టు) కొట్టు, చఱచు చాఁగఁబోవు, జపుము జాదు, తాటించు, తాపించు నలుపు పులుము, పెట్టు, బాఁదు బాఁదుకొను మొత్తు, మోఁదు రాకించు, దత్తు, వ్రేటుగొను, వ్రేయు

౨ - (పంపు)

౩ - (త్రుంచు)

**అడుజా** = (ఒకదినుసు దేగ - అందలి భేదములు) అఁజు, ఈలగ్రద్ద ఓరణము కంచుమించు, కడసరము, కడుజా, కణసెరము, కణుజు కనిసెరము, కురుజు, గిద్దు, గిద్దు, చంచడము చాఁపగద్ద చెంచడము, చెంచెడము, జలకట్టియ జలకట్టె, జాలె, జాలియ, జాలె, జావడము, జెలాకంటె డేగ, తెసుకు, తోఁచిగాఁడు, నేలాఁపు, బయిరి, బాఁజు, బెగుకు, బైరి లగడు, లగుడు, వయిల, వారణము వేసడ, వేసడము, వేస్త్రిము, శైల, సారణము, సాలువము, సాళువము, సార్వము, సెలకట్టియ, సెలకట్టె

**అడుప** = చూ అడప

**అడుపు** = (వ్రేటు) ఆటు కొట్టు గాఁటు తాఁపు దెబ్బ, నిడ్డ పెట్టు మొత్తు, లత్త, లాటు, వేటు, వేత వ్రేటు, వ్రేఁత

**అడుప** = (అడుగుపట్టినది) పాఁచి

**అడువు** = (అడుగు) చూ, ౧ అంజ.

౨ - చూ, ౫ అడుగు.

**అడువుఁబుట్టువు** = (కాఁపువాఁడు) చూ, ౨ అడుగుఁబుట్టువు.

**అడుసు** - (బురద) అప్రజ, అసలు, ఉప్పలి, ఉమ్మ [illegible] [illegible]ండు, కేజు, చదుకు, చవుకు, జవుకు జొత్తుకు, జౌకు దమ్ము పంకి, బంపన, బాడె, బురద, బెందడి, రొంపి, రొచ్చు లొచ్చు, వండదు, వండు, సుబ్బలి

**అడ్డు** = చూ, అడుగు

**అడ్డ** = (నాలుగు లెక్కగలది) ఉడ్డ ఉడ్డా చవు చవ్కము, చౌ, చౌకము, తిగవంచ తీకంచ, నాలుగు, నాలువు నాల్గు పుంజీ
౨ - (కంచములో సగము)
3 - (గుంటక లోనగువాని దిండు)

**అడ్డంకి** = (ఆటంకము) చూ, ౪ అంకె

**అడ్డకట్ట** = (ఏఱు లోనగువాని నీళ్లు కెంకెవోక కట్టెడు కట్ట) అన, అనకట్ట కట్టుగొం

**అడ్డకట్టు** = (ఆటంకపఱచు) చూ, అంకిలిపెట్టు

**అడ్డకత్తి** = (ఒకదినుసు పోటుముట్టు) తరకటి, తరవలి పట్టము పట్టెము పట్టెస మొహదా

**అడ్డకమ్మి** = (గడపయందు తొలిక్కడు కమ్మికి సరిమీఁదుగా నడ్డముగా వేయఁబడిన దూలము)

**అడ్డకట్టు** = (ఆటంకము) చూ, ౪ అంకిలి.
౨ - (ఒకానొక జబ్బు)

**అడ్డకొడమ** (చేఁపలఁబట్టు నొకానొక కొలముట్టు.)

**అడ్డగ** = (రూకలో సగము.)

**అడ్డగాలు** = (ఆటంకము) చూ ౪ అంకి

**అడ్డగించు** = (ఆటంకపఱచు) చూ, అంకిలిపెట్టు.

**అడ్డచాఁపు** = (అడ్డవాసపు దూలము)

**అడ్డనము** = (డాలు) అరిగ ఒడ్డనము, కేడము, కేడెము కేవడము డాలు డాలువాలు దడిగ ఫలక హరిగ
౨ - (బెత్తము లోనగువాని చేతఁ జేయఁబడిన కేడెము) ఒడ్డనము

**అడ్డపట్టియ** }
**అడ్డపట్టె** } చూ, అడపట్టె.

**అడ్డపట్టు** = (అడ్డముగా పట్టు)

**అడ్డపట్టుపాప** = (చంటిపాప)
అడ్డపాప, ఎలుగొడు, కందు కందువు, కసుగందు, కున్న, కుఱ్ఱ కుఱ్ఱడు కూన చంటిపాప చంటిపాపఁడు చంటిపిల్ల, చంటివాఁడు, చేతిబిడ్డ, నిసుఁగు నిసువు, పరచంటివాఁడు, పసిపాప, పసిబిడ్డ పాప, పాలపాపఁడు పాలుమఱచి పూప బిడ్డ బుడుత, బుడుతఁడు బుడుక బుడుకఁడు

**అడ్డపడు** = (అడ్డగొను) చూ, అంకిలిపడు

**అడ్డపాటు** = (ఆటంకము) చూ, ౪. అంకిలి
౨ - (కప్పు) అడ్డము అడ్డి అడ్డాకు, ఇఱుము ఎడతెఱ, ఎడతెగ్పు ఎడరు, ఓలము ఓలిమి, కనుమఱుపు, కప్పు, కప్పడు చఱపు, చాటు తెరపి, తెఱప, తెఱపి, తెలిసి, పొదుగుడు పొదువు మఱుఁగు మఱువు, మాటు, మాయి మునుకు ముసుఁగు, ముసుఁగుడు, ముసువు, మూఁత మూయి

**అడ్డపాప**=(అడ్డముగా పట్టఁదగిన బిడ్డ) చూ, అడ్డపట్టుపాప.
౨ - (దప్పికనున్నదానిఁ గనలేని కన్నులు లోనగువాని పాప

**అడ్డపెట్టు** = (ఆటంకము) చూ, ౪. అంకిలి.
౨ - (ఆటంకపఱచు) చూ, అంకిలిపెట్టు
3 - (ఈడుపెట్టు)

**అడ్డబాస** = (ముక్కునకుఁ బెట్టుకొను నొక నగ - అందలి భేదములు) నత్తు బులాకి, బులాకు బేసరి ముంగర, ముక్కర, ముక్కఱ ముక్కుఁగమ్మి ముక్కుపోఁగు.

**అడ్డమాను** = చూ అడపట్టె

**అడ్డమాడు** = (ఎదురాడు)

**అడ్డమిడు** = (ఆటంకపఱచు)

**అడ్డము** = (ఆటంకము.) చూ, ౪. అంకిలి
౨ - (మాటు) చూ ౨ అడ్డపాటు
3 - చూ అగావు
౪ - (పూఁట)

**అడ్డములేనివాఁడు** = (ఎదురులేనివాఁడు)

**అడ్డవాట్లు** = (ఆటంకము) చూ ౪ అంకిలి

**అడ్డవాతియమ్మ** = (ఒకదినుసు అమ్మ) పారాశతము, పాఱవాతమ్మ, పాఱమ్మ పాఱవాతియమ్మ.

**అడ్డవేడెము** = (పాముపడగవంటి గుఱ్ఱపుపడగ - అందలి భేదములు.)

గంతు చుట్టువేడెము, జంగ జగగంతు దవుసు దాటు దుముకు పల్లటి, పేరె మురువసడ

**అడ్డసరము** = ఒకానొక మందుచెట్టు )

**అడ్డసారె** = (పాచిక) సారె, సొగటము

**అడ్డసాళులు**
**అడ్డసాళ్లు** } (పాచికలు)

కవఱలు, సట్టులు, నామరులు, పాచికలు, పాసికలు సారెలు

**అడ్డాదిడ్డి** – (వరుస వావి లేనిది)

**అడ్డాలు** = (రెండుకాళ్లు చాచినదాని నడుము)

**అడ్డి** – (మాటు) చూ, ౨ అడ్డపాటు

౨ - (ఆటంకము) చూ, ౪ అంకిలి

**అడ్డిగ** = (రూకలో సగము )

**అడ్డిగలు** = మెడకుఁ బెట్టుకొను నగ-అందలి వేఱువేఱు)

అఱడా, అఱడు ఉత్తండము, ఉత్తండాలు కంటసరి కంటియ కంటె కట్టాణిగుండు, కుతికంటు, గోదుమ పూసలు గోళ్లకుతికంటు, తరగతిగుండ్లు తీఁగ తీఁగిజు, తీఁగె, తీఁగె మెడనూలు తీవ తీతియ, తీవె నాగపడగల దండ, నాగపడగలు, నాన, నానుకోవి, పట్టెడ, పలకసరి పలుకసరి పుంజాలదండ హైఁడికంటి బిరికీ మల్లెమొగ్గలు, మెడనూలు సరెడు

**అడ్డిపడు** = (ఆటంకమగు ) చూ, అంకలెపడు

**అడ్డీ** = (అనాకైన దినసుయొక్క పూఁతి)

**అడ్డు** = (ఆటంకము) చూ, ౪ అంకిలి

౨ - (ఆటంకపఱచు) చూ అంకిలిపెట్టు

**అడ్డుగ** = చూ, అడ్డిగ

**అడ్డుగట్ట** = (ఆటంకము) చూ, ౪ అంకి

౨ - (గడియమాను)

3 - (చెఱుపు)

**అడ్డుగాను** = (ఆటంకమగు) చూ, అంకిలిపడు

**అడ్డేడు** = (రెంకుమానికాలు లేక రెండు తవ్వల సరుకు )

**అణక** = ఎదుకాడి కెడు రెక్కట)

చూ ౨ అంక

**అణకించు** = (వెక్కరించు) చూ, ౧. అడకించు

**అణఁకువ** = (వంగియుండుట) చూ, అడఁకువ

**అణఁగంగొట్టు** = (అణఁగించు)

**అణఁగారు** = చూ, అడఁగారు

**అణఁగు** = చూ, అడఁగు

**అణఁచు** = చూ అడఁచు

**అణుఁకువ**
**అణుకువ** } చూ, అడఁకువ

**అణుకువాఁడు** = (కొట్టితెగవానికన్న పైవాఁడు )

**అణుజు** = (ఒకదినుసు డేగ) చూ అడుజు

౨ - (ఈఁకరాల్చిన పిట్ట) కుఱుజు, గూఁటిగువ్వ

**అతకరించు** = (తక్కువపఱచు, క్రిందుపఱచు)

౨ - చూ, ౨ అంగలించు

**అతగాఁడు**
**అతఁడు** } (ఆతఁడు) ఆతగాఁడు ఆతిఁడు, ఆయన,

**అతగుఁడు** = (బక్కవాఁడు) బక్క బక్కవాఁడు, బడుగు, బడువు, బెండుమానిసి, వక్కకట్టియ, వక్క కట్టె, వగ్గు

౨ - (బీద) గుల్లకాఁడు పండ, పరికట్టె పేద, బికారి, బికాసి, బీద బ్రిక్క, లొల్లెగాఁడు

**అతనికిఁగా** = (అతనికొఱకు)

**అతలకుతలము**
**ఆతలాకుతలము** } ( నలఁగుడు )

అఁకుఁ అలఁత అలపు అలయిక అలవు, అలసట, ఒఱుకు ఓలాకు, కాకు కుసిగుంపులు గాసి, చీకాకు, చెక్కువెదుర్పు, డప్పి, తంట తహతహ, దప్పి, దప్పిక, నలఁకు నలకువ, నలఁగుడు నిక్కచ్చి పాటు బడలిక, లంపట, వడ వేసట, సరమ, సేద, సోమ

**అతికించుట** = (అంటించుట )

**అతివ**= (ఆఁడుది) అన్ను, అన్నువ, అలరుఁబోఁడి ఆఁటది ఆఁటు, ఆఁడది, ఆఁడుకూఁతురు, ఆఁడుది, ఆఁడుపుట్టువు, ఇంచుఁబోఁడి ఇగురుఁబోఁడి ఇంతి, ఉగ్మలి ఉవిద, ఎలనాఁగ, ఒప్పులాఁడి, కలికి, కలువకంటి, కొమ్మ, కోమ కోమలి కాన్పులుఁగంటి, గుమ్మ గొంతి, గోతి, గోల, చాన, చామ చిగురుఁబోఁడి, చిగురుఁబోణి, చిలుకల కొలికి, చెలి, చెలియ, చెలువ చెల్వ చేడియ, చేడె జోటి, జోటిక, తమ్మికంటి, తలిరుఁబోఁడి, తీఁగఁబోఁడి తీఁగెఁబోఁడి, తియ్యఁబోఁడి, తెరవ, తెఱవ, తొగకంటి, తొయ్యలి, తోయలి, నసఁబోఁడి, నవల, నవలా, నాతి, నాతుక, నెలఁత, నెలఁతుక, పడఁతి, పడఁతుక, పణఁతి, పణఁతుక, పయిదలి, పువుఁబోఁడి, పువ్వారుఁబోఁడి పూఁబోఁడి, పూవుఁబోఁడి, పైదలి, పొలఁతి, పొలఁతుక పొలతి పొలుతుక, పొల్తి, పొల్తుక, పోలి, ప్రోయాలు బిత్తరి, బోటి, బోఁడియ, బోణి మగువ, మచ్చెకంటి, మడఁతి, మడఁతుక, మానిసి, మించుఁబోఁడి, మిటారి, ముగుద, ముదిత, ముదియ, ముద్దియ, ముద్దుగుమ్మ మెఱుఁగుఁబోఁడి, మెలఁత, మెలఁతుక, మెల్త, మెల్తుక, లేమ, వలఁతి, వాలుఁగంటి వాల్గంటి, విరిఁబోఁడి వెలఁది, వెలఁదుక సకియ

**అతివస** = (ఒకానొక మందుదినుసు)

**అతుకు** = (గుడ్డ నొకదానితో నొకటి కలుపుట)
అదుకు అస్తరు అస్తరువు మాసిక.
౨ - (అతుకుట) అదుకు
౩ - (అతికినతావు) అదుకు.
౪ - (అంటుకొను) అదుకు.
౫ - (అంటించు) అదుకు

**అత్త** = (మగనియొక్క తల్లి)
౨ - (పెండ్లముయొక్క తల్లి)
౩ - (తండ్రి తోఁబుట్టువు)
౪ - (మేనమామ పెండ్లము)

**అత్తడి** = (ఆఁడుగుఱ్ఱముయొక్క అంటు) నత్తడి

**అత్తపత్తి**= (ముడుఁగుఁదామర.) పొత్తిదామర, ముడుఁగుఁదామర, ముణుఁగుఁదామర, మొగడుఁదామర సోఁకుఁడు ముడుఁగు.

**అత్తమిల్లు**= (పండుకొను) తెండు, తెనమణు, తెన్నుండు, తేఁడు, తొంగు, తొన్నుండు, పండు, పండుకొను, పడకసేయు పడు, పన్నుండు పరుండు, పవడించు, పవళించు పవ్వడించు పవ్వళించు
౨ - (అంతట నిండుకొను) చూ, ౪. అదరు
౩ - (కుంకు) కుంకు, కూఁకు వింగివడు, పడు.
౪ - (ఒఱగు) ఒడ్డగిలు, ఒడ్డగిల్లు, ఒరగఁబడు, ఒరగు, ఒరగువోవు ఒఱగు ఒఱగఁబడు, ఒఱగువోవు, ఒఱవఁబడు ఒఱవు ఓఱగిల్లు ఓరవోవు, కయిజాఱు, కయివ్రాలు కైజాఱు, కైవ్రాలు, కొంగోడువడు, కొంగోడువోవు, చాగిలు, చాగిల్లు చాఁగు, చేరు, తొప్పతిలు, తొప్పతిల్లు తొప్పఱు

**అత్తము** - (అరటిపండ్ల గెల) అత్తెము
౨ - (మూఁక) చూ అంటలు

**అత్తరము** = (తొందఱపాటు) చూ, ౬. అక్కుఱు

**అత్తరు** / **అత్తరువు** (మంచివలపుగల నూనె) తావినూనె.

**అత్తళి** = (అప్పుడు)

**అత్తలము** / **అత్తళము** (నేజాయను కొఱముట్టు)
ఈఁటియ, ఈఁటె చివ్వ నేజ బరిచి బరిచీ, బల్లియము బల్లెకోల బల్లెము

**అత్తి** = (ఒకానొక చెట్టు) చూ, అంజూరు
౨ - (ఏనుఁగు) ఎక్కుడుమెకము, ఏనిక, ఏనుఁగు, ఏన్గ, గబ్బచెంపమెకము, గొప్పబొజ్జమెకము, గొప్పయ్యజ్జ మెకము, గొరు చెయ్యిగలమెకము, చేగలమెకము, చేటచెవులమెకము పలుగొమ్ములమెకము బలునంజె మెకము బలుహజ్జమెకము బల్తలమెకము రెంట త్రాగుడు రెంటత్రాగుడుమెకము వెల్లగొమ్ములమెకము, సిబ్బమనిమెకము హత్తి

**అత్తు** = (మైనపుగుడ్డ) అత్తెము, హత్తు
౨ - (పొందు) చూ ౯ అంటు
౩ - (కలుగు) చూ, ౯ అడరు
౪ - (తగు) అనువుపడు, అమరు అయిరకొను, అలవడు, ఉరు, ఉఱు ఐరకొను, ఒదవు, ఒనరు, ఒప్పు కలుగు, కుదురు, కూడు, కొన, కొలుపు గుణపడు, చక్కఁబడు, చనుచెల్లు, చొప్పడు, చొప్పిల్లు, ఒరపడు, జోకపడు, తగు, తవు, తీరు తొ, నిగుడు నాలుకొను నాల్కొను,

పొసగు పోలు మక్కళించు వచ్చు వలయు సన
సరిపడు సూత్రిపడు హత్తు

**అత్తెము** = చూ ౧ అత్తము

౨ - (దేగ కాలిగోళ్లు తగులకుండునటులఁ జేతికిఁ గట్టు
కొను తోలు )

3 - చూ ౧ అత్తు

**అత్తెసరు** = (గంజి వారకుండ వంటకములో నిమిడిపోవు
నట్లు పెట్టెడి యెసరు )

**అత్త్రోటము** = (అట్టి)

**అదంత్రిము** = ( వీలు తప్పినది )

**అదక** = (ప్రాఁతదైై చివికిన కాలిచెప్పు )

**అదటు** = (కండకావరము ) అసము, ఉదుటు, ఎగళు
ఏతు ఏపు ఒయారము, ఒయ్యారము, కండకావరము,
కచ్చు కావరము క్రొవ్వు గబ్బు, గెబ్బు, గోరింపు
డంబు డబడబ తరితీపు తిమురు తెగటు, త్రుళ్ళు
త్రుళ్లింత త్రుళ్లు దుడుకు నిక్కు, నెగపు పించము,
పిలుకు, పీఁచము పురి పొంగు, పొగరు, పొవరు
పోతరము ప్రల్లఁదనము బడాయి బింకము బింకము
బిగి, బిగువు బిట్టు బీరము బెట్టిదము బెట్టు మల్లరము,
మిట్టిపాటు, మిడి మిడిమేలము మిడిసిపాటు మురి,
మురిపెము మఱిపెము, ముఱిపు ముఱికము మెకమెక
పాటు రాఁకపోఁక, విఱ్ఱవీగఁబాటు వీఁక వీకు

౨ - (మస్తు) అఱిక యము కయిపు కావరము కావ
లము కైపు క్రొవ్వు గబ్బు జడ్డిగము పించము పోత
రము పోసరము మంపు మత్తు మమురువు మబ్బు
మయికము మయిద మయిదు మేలు మైకము, మైద
మైదు లాహిరి లాహిరీ సోలము, హోమిక

**అదనము** = (హెచ్చు) చూ ౪ అంకపొంకములు.

**అదనబదనగుట** = (చెక్కుచెదరకుండుట )

**అదను** = (రతి) చూ ౧ అంకె

**అదనైనవాఁడు** = (అఁకకొన్నవాఁడు) ఆకొన్నవాఁడు

**అదరంటు** = (చుఱుకుపుట్టు )

**అదరించు** = చూ అదలించు

**అదరిపడు** = ( త్రుళ్లిపడు )

**అదరు** = (దిగులు) చూ, అంజిక

౨ - (దిగులుచే దడదడ కొట్టుకొనుట )

3 - (కదలిక ) అదురు ఇసిటింతలు, ఉలివు ఎసకము,
కదలిక కదలు, గెంటు తడఁబాటు, తలఁకు, తలఁడు,
తల్లడపాటు, తల్లడము తుంపెసలు తొలఁకు, నుక్కుట,
పటికిరింత పదరు, పల్లటు, బెడఁకు, బెణఁకు, బెనఁకు,
బెళుకు తెగడు

౪ - (దిగులుపడు) చూ, అంజు

౫ - (కదలియాడు ) చూ ౧. అటుమటించు

**అదరుగడ** = (దిగులు) చూ, అంజిక

**అదరులు** = (నిప్పురవ్వలు) నిప్పుకలు, నిగ్గులు, మిడుఁ
గుఱులు, మిడుఁగులు మిణుఁగుఱులు, మిణుఁగులు,
మినుఁగుఱులు.

**అదలించు** = (బెదరించు - గద్దించు )

**అదలు** = (దిగులుపడు) చూ, అంజు.

**అదలుచు**
**అదల్చు** } (గద్దించు - కసరు)

**అదలుపు**
**అదల్పు** } (గద్దింపు - బెదరింపు) దట్టన.

**అదవ** = (కొండలోయ) కోన.

౨ - (ఇంటికిచ్చు సద్దె) అద్దియు అద్దె, ఇల్లరి, బాడిగ.

**అదవద** = (కలఁత) చూ, ౨ అంకిలి.

౨ - (వగపు) చూ ౧ అడలు

3 - (మాఱుపల) చూ అకటవికటము

**అదవదపడు** = (కలఁతపడు) కలఁకఁబాఱు, కలఁగఁబడు,
కలఁగు కలఁతపడు కలగుండుకొను, కలగుండుపడు,
కలగొను

**అదవెట్టు** = (కుయిపెట్టు )

**అదాటు** = (ఉన్నట్టుండి ) అదిరిపాటు.

**అది** = (అయ్యది-ఒక దానినిఁగూర్చి చెప్పుటలో వచ్చునది)
అద్ది అయ్యది, ఆయది.

**అదిగో**
**అదిగోన్** } (చూపుటను తెలుపునది )

అదిర
అదిరా } (అబ్బురమునందగునది - ఔర) చూ ౨ అక్క.

అదిరిపడు = (ఉదిరిపడు) ఉలికిపడు.

అదిరిపాటు = (ఉన్నట్టుండి) చూ, అదాటు.

అదుకు = చూ, అతుకు

అదును = (తఱి)

అదుము = (అణచు) అను, ఊను, ఒత్తు నొక్కు

అదుముడు = (అదుముట - ఒత్తుడు) అమ్మొత్తు అలుగుల అలుగులము, ఈండ్రము ఒత్తు, ఒత్తుడు, నొక్కుడు గజిబిజి గసిబిసి, గుజగుజ గులగులలు చదియు, నలుగుడు, పఱిపఱి, మల్లాడి, పెంపఱ

అదురు = (దిగులు) చూ, అంజిక
౨ - (కదలిక) చూ 3 అదరు
3 - (కదలియాడు) చూ, ౧. అటుమటించు.

అదురుగడ = (అదిరిపాటు)

అదురుగుండియ = (పిఱికివాడు) కోచ గిరస, చల్ల జంపు దొంయిగొట్టు దొబ్బలగొట్టు కుంద పారోపిఱు, పాఱుబోతు పిఱికిబొబ్బలగొట్టు.

అదురుగ్రోవి = మ్రానియందు యినుప గొట్టములు నాటించి వానియందు మందు దట్టించి అదురునట్లు వ్రేసెడు వేటు) అదురువేటు

అదురుచు
అదుర్చు } (కదలాడు) చూ, ౧. అటుమటించు

అదురుదిరిక్క = (గొడ్లకువచ్చు నొకానొక జబ్బు) అదువుదిరిక్క, ఉంగడ ఉంగిడి, గురుకు చురుకు, దొమ్మ నరిడి, నాలికచేటు, పుప్పి

అదురువేటు = చూ, అదురుగ్రోవి.

అదువ = (నిలుకడ లేనిది.) అద్దువ

అదువకావు
అదువుకావు } (అద్దెకావు)

అద్ద = (సంగోరు) అర్ధము, అర, అఱ సగము, సవము, సాబాలు, సాము, సావాలు
౨ - (అరసోల)
3 - (నూర్చుకవేసిన వరికుప్పయొక్క క్రింది సగముమంతు)

అద్దకము - (బట్టలకు వేయు రంగు)

అద్దగోడ = (సఱుంగుగోడ)

అద్దమరేయి = (నడిరేయి) కాందారి, కాందారి మాందారి పొద్దూ కాదారి కాదారి మాదారి నడికిరేయి, నడికిరేలు నడిరేయి నడురే నడురేయి, ముచ్చుప్రొద్దు, సరిపొద్దు

అద్దము = (సంగోరు) చూ, ౧ అద్ద.
౨ .. (మోముజూచుకొను గాజుబిల్ల)

అద్దరి = (అవల) చూ, ౨ అక్కడ.

అద్ది - చూ, అది

అద్దించు = (బట్టకు రంగు వేయించు)

అద్దికము = (కావలి) ఇల్లడ ఇల్లడము. ఉక్కణము, ఏడుగడ, ఏర్గడ, ఏలుబడి, ఏల్బడి కాపుగడ, కాపు, కుయి కుయ్యి కూలు, తోన, నీడ, పారా, పాళియము, పాళెము, బలకరము, బళకరము, మనుపు

అద్దిటి
అద్దిటియ్య } (మెచ్చుటయుందగునది) చూ, 3 అజ్జ.

అద్దియ = చూ ౨ అదన

అద్దిర
అద్దిరా } (అబ్బురమునందగునది) చూ ౪. అక్క.

అద్దిరపాటు = (అద్దిరిపడుట)

అద్దు = (తోచు)
౨ - (రంగువేయు)

అద్దుముద్దు = (చిన్నపిల్లల చెయ్యువు)

అద్దువ = చూ అదున

అద్దె = చూ అదవ.

అద్దెకావు = చూ, అదువకావు

అద్దెఱ = (మెచ్చుటయందగునది) చూ, 3 అజ్జ

అద్రుచు - (కదలు) చూ, ౧ అటుమటించు

అన = (మొదటివాఁడు) అన్న అప్ప, పెద, పెద్ద, పెద్దవాఁడు మొదటివాఁడు

౨ - చూ అడ్డకట్ట

౩ - (చాఁగునట్టి మిక్కిలి లేఁత కొమ్మ

అన్ = (అనుట అనునట్టి అనఁగన్ )

అనన్ = (అనుట అనఁగాన్, అనేవరకు )

అనకరయ్యె = (పలుకవలుకవయ్యా, అనినట్లయితే అనునట్లుగాన్ )

అనఁగన్ } (చెప్పఁగాన్ చెప్పినట్లయితే, చెప్పేవరకు )
అనఁగాన్ }

అనఁగు = (కలఁచు ) తగులు, తవులు, తొలు, తొడరు, దొరలు, పెనఁగు పెనయు పొవు, మెళగించు, మెళవించు.

అనఁటి } చూ అంటి.
అనంటి }

అనద = ( ముండమోపి ) ఆలకి కుంక కుంకి తెంపి, ముండ ముండమోపి ముసుకు ముసుఁగు, మోపి.

౨ - (కొద్దివాఁడు ) కడి కించు కొంచెకాఁడు కొద్దివాఁడు, కించు కించుడు గొఱకు దూబ, ద్రాబ, నీచు పావలి పెక్క సొద్యాకుఁడు ఉల్లిగాఁడు, వెలితిమానిసి సన్నగాఁడు సన్నపువాఁడు

అనయమున్ = ( మఱిమఱి ) కడు, నలిన్, పొరిన్, మఱిమఱి.

౨ - ( అక్కఱ )

౩ - ( మఱియు మఱియు ) చూ, అందందన్

౪ - (ఎల్లప్పుడున్ ) అప్పఁడు ఎల్లప్పుడున్, ఏప్రొద్దున్, నిచ్చ నిచ్చలు

అనరు = (ఇక్కట్టు ) ఇంట్రిము ఇంటరము ఇక్కట్టు ఇక్కము ఇక్కుపాటు ఇజుకు ఇమ్మవప్పు ఒదుదొడుకు, ఒఱపటము ఒఱపము ఒఱగడ్డము కక్కసము, చిక్కు జడ్డ, తసకలి, తొక్కట, తొక్కటము త్రొక్కట, త్రొక్కటము, నిక్కచ్చి పొరాట, ముట్టుపాటు

అనరులు = ( కీలు ) అణి, అణీ, అను, అయము, ఒళవు, కిటుకు కీలకము, కీలు, కొఱసంది, గాయకము, గుట్టు, గుసుకు గుటికొండి, తాపి, తాపీ, నెఱఁకు, నెఱవు, నెళవు పిక్కు, మర, మారాటము, మఱువు, లోచెయి, లోచెయ్యి

అనలుఁగొనలు } (ఎచ్చైన మెత్తఁదనము)
అనలుంగొనలు }

అనవటిల్లు = ( వంటకముడికి చల్లారు )

అనవుఁడు = ( పలికేవరకు )

అనాక = ( పలుకక, ఎంచక )

అనాగన్ = ( అనునట్లుగాన్. )

అనాన్ = ( అనునట్లుగన్ - అనఁగన్. )

అనాస = ( ఒకానొక పండ్లచెట్టు ) మొగిలిపనస.

అని = (పోరాటము.) ఆలము ఏక్కలి కంగారు, కంగిసు, కయ్యము, కలఁకు, కలన, కలను, గొదవ, గోడవాడము, చివ్వ, జగడము తవాయి దురము, పడవ, పెనఁకువ, పెనుఁకువ పోటు పోట్లాట పోరాట పోరాటము, పోరితము, పోరు బవరము, మేడము, లడాయి

౨ - ( అల్లిక మొదలు )

౩ - (పేరుఁదెలుపునది) పవి, సావి

౪ ( తలఁచుటను తెలుపును )

౫ - ( కతమును దెలుపును )

౬ - ( కొప్పకసమును దెలుపును )

౭ - (పలికి )

అనికి = (కంగాళము ) కంగాళము, కంగాళము, తపెల, పవ్వ బందడము బందరము, బందలము, బాన.

౨ - (నేఁత ) అల్లకము, అల్లి, అల్లిక అల్లుడు, నేఁత.

అనిచిపుచ్చు = ( పంపించు )

అనియెన్ = ( పలికెను )

అను = (మాటాడు ) అప్పనసేయు, ఆడు, ఉగ్గడించు, ఎత్తు, చిటుకుపాటుకుసను, చెప్పు తడవు, దబ్బు, నడుగు, నుడువు, నొడుగు, నొడువు, పలుకు, పల్కు, పేరుకొను, పేరుగుఱిచ్చు పేర్కొను, మందలించు, మాటాడు, వాకుఱిచ్చు, వాపుచ్చు

౨ - ( అని చెప్పు. )

౩ - ( అని యడుగు. )

**అనుకు** = (ముద్దగాకి పలుచనైనది) పిచపిచ, పిదపిదన, మదుగు, మదుము, మదువు

౨ - (కదలిక)

**అనుగలము** = (తోడు) ఊఊరు, ఒంటింపు తోడు తోడునీడ, పక్క, పక్కము, కాసట, మద్దత్తు, వెంట, వెంబడి, వెన్నాన.

౨ - (ఇమ్ము) ఇమ్ము, నయగారము, పాఁవ, మయిపడి, మెయికడి, మైకడి, కలఁతి, కల్ల వీలు, పార్లా

3 - (ఈడు) ఈడు, ఉజ్జీ ఉద్ది ఉద్దియ, ఎన, ఎనయిక, ఒర, జత, జోడు, జోక, జోడుకోడియ, జోడుకోడె, తరబడి, తరము, తీరము ౹నకు, దినుసు, దీటు, దొర, నెట్టె, పాటి, పాడి, పురుడు, పోలిక, పోలిక, పోల్కి, బడికోలు, మాదిరి, మాదిరి, వంతు, వయసు, వీఁక, సరి, సరిపోటు సరకు, సాటి, సాటిక సాటుక

**అనుఁగు** = (నేస్తకాఁడు) చూ, ౨ అంటు.

౨ - (మొదటిది) ఎలగోలు, తొలి, తొలుత, తొల్త ముంగోలు, మొదటిది.

3 - చూ, ౨. అందము

౪ - (కన్నాకు) కన్నాకు గమికాఁడు మొనకాఁడు

**అనుఁగుఁగత్తియ** = (చెలికత్తె) చెలి, చెలికత్తియ, చెలికత్తె, చెలిమరి చెలిమికత్తియ, చెలిమికత్తె, జోటికత్తియ జోటికత్తె బోటి, బోటికత్తియ, సకియ

**అనుఁగుఁదనము** = (నేస్తము) చూ 3 అంటు

**అనుచు** = (పనుచు) చూ, ౬ అంచు

౨ - (అణఁగఁజేయు) చూ, ౭ అంచు.

3 - (పుచ్చు) చూ, ౮ అంచు

**అన్చు** = చూ, ౭ ౮ అంచు

**అనుడు**
**అనుడున్** } (అనేవరకు)

**అనుపరి** = (సుంకము తీయువాఁడు) సుంకరి, సుంకరీఁడు, సంకీఁడు

**అనుపనూది** = (గుండునూది)

**అనువు** = (సుంకము) దాణము, సుంకము

౨ - (వెడలిపోవువారికి తోడు పంపుట)

3 - (పనుచు) చూ, ౬ అంచు

౪ - (పుచ్చు)

**అనుమంతిగాఁడు** = (కుక్కకియ్యఁబడిన పేరు) అందలి వేఁడపులు

కస్తురి, కస్తూరి, గబ్బి చిటికాఁడు, చిటిలింగఁడు, చెంగలువ, కొట్టి జోడఁగి, జోణఁగి, పిరంగి, పులి నుఁడు, పోతులరాజు బూచిగాఁడు బూతనాదుఁడు, మల్లెల గుఁది రాహుత్తి కంఠికుండు, సార్వఁడు, సింగాణి, సింగిణి, సింగిణీ సికఁగి

**అనుము** = (ఒకానొకదినుసు పంట) అనుమ

౨ - (ఒప్పు)

**అనుములు** = చూ, అక్కుల్లు

**అనువరి** = (నెరవరి) ఉపమరి, నెప్పరి, మేకడికాఁడు, వయిపుకాఁడు, నెరవరి, నైపుకాడు

**అనువు** = (తీరు) చూ ౧ అంగము.

౨ - (నెరవు) ఇమ్ము ఉపమ ఎత్తు, ఎత్తుగడ, ఒడికము, ఒఱపు కీలు, జతనము, తెలుకువ, దీమసము, నెప్పు, పొక్కి, మందు మేకడి, వజ్జ, వయినము, వయిపు వలన, వళవు, నెరవు నెరవు నైనము, నైపు

3 - (తీఱుబడి) ఎడ ఎడము ఎసలిక, తీఱిక, తీఱుగడ, తీఱుపాటు, తీఱుబడి తెలుపి పట్టు, బిడువు, సందు.

౪ - (తిన్న) ఇమ్ము, ఒడికము, జోక, తిన్న, నెరవు, నెఱవు వలను, నెరవు సరి

**అనువుచేయు** = (సమకట్టు) జోకచేయు, సమకట్టు

**అనువుపడు** = (సరిపడు) చూ ౪ అత్తు

**అనుసు** = (దుష్టుకట్టు లోనగువానికి వేసెడు యినుము లోనగువానిపొన్ను) తొడుగు, తొడుపు, తొడువు తొడ్గు)

**అన్ము** = చూ అనుము

**అనువందు**
**అనువొందు** } (ఒప్పు)

**అన్న** = (పెద్దవాఁడు) చూ, ౧. అన.

౨ - (తండ్రి) అప, అప్ప అబ్బ, అయ, అయ్య, కన్నయ్య జియ్య తండిరి, తండ్రి, నాయన, బాబయ్య, బాబు,

అన్నగళ / అన్నగళి / అన్నగున } (పేడి) ఊబ ఊబవాఁడు, ఎగ్గడి, కొజ్జ దూబ, పండ, పేడి.

అన్నన్ = (అనేవరకు)

అన్నన్న / అన్నా } (అబ్బురమందగునది) చూ, ౪ అక్క

అన్ని = (అంతయు) చూ, ౧ అంత

౨ - (అంతలెక్కగలవి)

అన్నిఁదినువాఁడు = (నిప్పు) చూ, అంటని కేకె

అన్ను = చూ అతివ

౨ - (ఒప్పుఁగమి) అన్నువు, చొక్కు, నిక్కొర, నిక్కొఱ, నిక్కొఱఁగు నిక్కొఱపాటు ఐరవసము, ఐరవసము, మయిమఱపు మఱపు మెయిమఱపు మైమఱపు, వితాకు సొగపు సొగయిక, సొగసు, సొలపు సోలము

అన్నుకొను = (మయిమఱచు) ఎరగొను, చొక్కు, తేలగిలఁబడు, తేలగిలు తేలగిల్లు తేలు, నిక్కొఱపడు, సొగయు

అన్నువ (అఁడుది.) చూ అతివ

౨ - (కొద్ది) అలకన అలఁతి, అలుపము అసదు, ఈరు ఉం ఎల ఒకింత, ఒక్కింత కసిడి, కాకి, కింకిరి కినుకు కీసర కుఱకుఱ కొంచియము కొంచెము, కొద్ది గిటుగిటున గుడిగుడి, గుల్ల గోరు చికిచికి, చిటి, చిటిపొటి చిట్టి చిడిపి చిడుగు చిదుర, చిన చిని చిన్న చిన్ని చిప్ప చిరుకు, చిటి, చిఱు, చిఱుత, చిరిది, చిఱుక చెఱుకు చెనఁటి చెన్నఁటి, జిలిబిలి, జిఁగు జిల్లు తక్కువ తని, తిబిరి తుక్కు, తోడెము తోలెము దోలి, నని, నీరు నులి, నసి, పిన పిన్న పిల్ల పిసరు పున్న పులు, పుల్లు, పొటిపొటి, బుచ్చి బుడిబుడి బొమ్మ మతి, మొక్కిడి, రవ, లే, లేఁత, వెడ, సన్నము సయికము, సలికము, సైకము, హాల్క

అన్నుపన్ను = (పన్న మొనలగునవి)

అన్నువు = (మైమఱపు) చూ, ౨ అన్ను.

అన్నకాఁడు = (చెఱుపు చేయువాఁడు,)

అన్నెకారి = (చెఱుపు చేయునది.)

అప = (తండ్రి) చూ, ౧ అన.

౨ - (తల్లి) అప్ప అమ, అమ్మ, అవ, అవ్వ, కన్నది, తలి తల్లి, తాయి

3 - (పెద్దతోఁబుట్టువు) చూ, ౧ అక.

అపక = చూ, ౨ అగప.

అపదూఱు = (కానిమాట) అపనిపము కానిమాట, గోడు

అపనమ్మకము / అపనమ్మిక } (నమ్మకము లేకపోవుట)

అపనిపము = (దూఱు) చూ, అగడారు,

౨ - చూ అపదూఱు

అపరంజి = (మేల్మి పసిండి) ఉదిరి, కడాని, కుందనము, జాలువా, జాళువ, జాళువా జాళ్వా, పుత్తడి, పుత్తలి, మేలిమి,

అపరాలు - (పయిర దినుసులు.)

అపుడు = (అత్తఱి) అప్డు అప్పుడు

అపురూపము = (ముందు లేనిది) అబ్బురము, అరుదు. అబ్రిము, క్రొత్త

అప్డు = చూ, అపుడు

అప్ప = (తండ్రి) చూ, ౧. అన.

౨ - (తల్లి) చూ, ౨ అప.

3 - (పెద్ద తోఁబుట్టు) చూ, ౧ అక.

౪ - (పెద్దవాఁడు) చూ, ౧, అన.

౫ - (అబ్బురమునందగునది) చూ, ౪ అక్క

అప్పగించు = (ఒకనికి లోఁబరచు) ఒప్పగించు, ఒప్పనసేయు, ఒప్పించు.

౨ - (పదిలముగా గాపాడుమని యొప్పగించు) ఒప్పగించు, ఒప్పించు

అప్పగింత = (ఒప్పగింత) ఇల్లడ, ఇల్లడము, ఒప్పగింత.

అప్పచి = (ఒకానొక పిండివంట) అప్పచ్చి, అప్పము కజ్జాయము, కజ్జము, కజ్జాయము, కజ్జియము, కజ్జెము.

**అప్పచిలు** = (పిల్లలాడుకొను నాట) చూ, అందలములు

**అప్పచ్చి** = చూ, అప్పచి.

**అప్పచ్చిలు** = చూ అప్పచిలు

**అప్పటప్పటికి** = (అప్పుడప్పుడు)

**అప్పటము** = (కలపడములేనిది)

**అప్పటి** = (మరల) ఇంకన్, ఇంగన్ ఎప్పటి, క్రిష్షన్, క్రిమ్మటన్, క్రిమ్మఱన్, తిరుగన్, పదంపడి, పదపడి పొరిన్, బరువడిన్, మగుడన్, మరల, మఱల, మఱి, మాటికిన్, వెండి, వెండియున్, సారెన్.

**అప్పడము** = (ఒకానొక దినుబడి దినుసు)

**అప్పణ** / **అప్పన** } (ఆనతి.) అప్పన, ఆఁక, ఆన, ఆనతి, ఓజ, కట్టడ, తోడు, దురా, దురాయి పంపు, పని, పనుపు పన్పు పర్మానా, ముదల, రజా, సెలవు

**అప్పనసేయు** = (మాటాడు) చూ, ౧ అను.

**అప్పము** = చూ, అప్పచి.

**అప్పళము** - చూ అప్పడము

౨ - (చఱపు) అప్పళింత, చప్పటు, చఱపు

౩ - (వడి.) చూ ౧ అంకపొంకములు

**అప్పళములు** = (పిల్లల యాట) చూ, అందలములు

**అప్పళించు** = (ముట్టుకొను) చూ, ౧౦ అంటు

౨ - (కప్పు) కప్పు, కమ్మరించు దబ్బువెట్టు, పొదుగు, పొదవు, పాప్రు, మూయు

౩ - (చఱచు) చప్పటించు చమఱు, చఱచు, తట్టు, దబ్బడించు, పటుకళించు

౪ - (అలము) అఱుము అలము, ఒత్తరించు, ఒత్తు ఒత్తుకొను, కదుము, చఱచు, ముట్టుకొను, మొగరించు

౫ :- (ప్రచ్చుకొను.) చూ, ౨ అందు.

౬ - (తడిపోవనొత్తు) ఉసుము, ఒత్తు చఱచు, తుడుచు, తుడ్చు పాప్రిము

౭ - (వన్నెలొసగువాని దళముగా పూయు) మెత్తు

౮ - (పూను) ౧ అంగవించు

**అప్పళింత** = చూ, ౨ అప్పళము.

**అప్పసము** = (ఎల్లప్పుడు) ఎడపక, జడి, నిచ్చ, నిచ్చలు, వాలాయము, వాలెము

౨ - (ఎడతెగక) చూ, ౧ అనయమున్

**అప్పా** = (అ స్వరమునకంతగునది.) చూ, ౪ అక్క

**అప్పాటను** = (ఆలాగున-వెంటనే)

**అప్పు** = చూ, ౧ అచ్చుకల

**అప్పుడు** = చూ, అపుడు.

**అప్పులకాఁపు** / **అప్పులపోతు** } (అప్పుపుచ్చుకొనువాఁడు) అరకరి, అరుక

**అప్పులవాఁడు** = (అప్పిచ్చినవాఁడు.)

**అప్పువడు** = చూ, ౭ అచ్చు

**అప్పువెప్పు** = (పచ్చివెచ్చ)

**అబందర** = (చక్కనచెడినది)

**అబక** = (కొయ్యతెడ్డు) చూ, అగప

**అబాసి** = (తుంటరి - దుండగీఁడు)

**అబీసీలు** = (సికాయ)

**అబ్బ** = (తండ్రి) చూ ౧ అన

౨ - (ఇబ్బందిని దెలుపునది)

**అబ్బకాఁడు** = (ములుచ) ఎడ్డియ, ఎడ్డె, ఎడ్డెఁడు కూళఁడు, పిసాళి, బేల బొప్పడు, మడియఁడు, మడ్డి, ముగ్దఁడు ములుచ ముల్ప మొద్దు మొద్దుఁడు, మొరకు, మోటు వీటఁడి వెంగలి, వెంగళి వెంబర, వెకలి, వెక్కలి వెడఁగు, వేదఱ వేజఁడి

**అబ్బపేరుఱేఁడు** = (చాలుపేరింటి పూఁబోఁడి తండ్రి)

**అబ్బరము** - (వింత) చూ ౧ అక్కజము

౨ - (కొలఁత లేనిది)

**అబ్బాటు** = (వెనువెంటనే) అవఘాటము, డబ్బాటు

౨ - (మంది హెచ్చుగా గూడుటవలనఁ గలిగెడు కాక)

**అబ్బ** = (పిల్లకాయ.) కందు, కున్నఁడు, కుఱ్ఱ, కుఱ్ఱఁడు, కొండిక, కొండికవాఁడు, కొండొక, చిన్న, చిన్నవాడు, చిఱుత, చౌఱ, చోర, చోఱ, చోఱవాఁడు, దుడుకఁడు,

దుడ్డె వన్న నవ్వ పడుచఁడు పడుచు, పయిద, పసి వాఁడు పాప పాపఁడు పిన్న పిన్నవాఁడు పిల్లకాయ పిల్లగాఁడు పెడుచఁడు పైన పోఁటఁడు, పోతీగాఁడు, బుడుత బుడుతఁడు బొట్టె బొట్టెఁడు బోడిక, బోడిగ లేఁత

అబ్బాలాడు = (తడఁబడు)

అబ్బు = (దొరకు) చూ ౧ అగపడు

అబ్బురపడు = (వెఱఁగుపడు) చూ అక్కజపడు

అబ్బురపాటు } (వెఱఁగుపాటు) చూ ౧. అక్కజము
అబ్బురము }

అబ్బెంద = (ఒకానొక చెట్టు)

అబ్రపడు = (వెఱఁగుపడు) చూ అక్కజపడు

అబ్రము = చూ ౧ అక్కజము.

అమ = (తల్లి) చూ ౨ అవ

౨ - చూ ౩ అక

అమడలు = (కవలబిడ్డలు) కవలు

౨ - (ఒకానొక పైరు) గనుములు, గురుకలు, గోలివెలు, గోల్లగొండిలు దూసరులు నివరి, నివ్వరి నీవరి బరపటలు

అమయు = (పనికివచ్చు)

అమరన్ = (ఒప్పనట్లుగాన్)

అమరకము } (పాలెపట్టుదొరలకీయఁబడిన కొలఁది సీమ)
అమరము }

అమరించు = (కూర్చు - పొందుపఱచు)

అమరిక = చూ ౧ - ౨ అంగము.

అమరు = (ఒప్పు) చూ ౩ అడరు

౨ - (కుదురు) చూ ౪ అత్తు.

౩ - (పొందికపడు)

౪ - (పూనుకొను) జతనుపడు, నడుముకట్టుకొను

౫ - (చేకుఱు) అలవడు ఈడేఱు, ఎక్కు, ఏరుపడు ఒడఁగూడు ఒనగూడు కడముట్టు, కొనసాగు చెల్లు చేకుఱు, జతపడు, తలకూడు దొరకొను నివ్వటిలు నివ్వటిల్లు నెరయు, నెఱయు, నెఱిపడు, పాల్పడు, మూరిఁబోవు, సమకుఱు, సమకూడు, సమకూరు, సమకొను

అమరుచు } (అమరంజేయు)
అమర్చు }

అమాంతగాఁడు = (చిల్లరచేరగాఁడు)

అమాంతము = (చిల్లరచేరము.)

౨ - (అప్పటికప్పుడు)

అమాని = (దొరతనమువారు తమంతఁదాము కనుగొనినది)

అమారు = (ఓడ లంగరు తాడు)

అమిజి = (కూలిలేక చేసెడు పని) వెట్టి

అమీరు = (పాదుషా)

అమ్మ = (తల్లి) చూ, ౨ అవ

౨ - చూ ౩ అక

౩ - (అబ్బురమందగునది.) చూ, ౪ అక్క

అమ్మకచెల్ల = (ఘోర - అబ్బురమందగునది.) చూ, ౪ అక్క

అమ్మకము - (అమ్ముట) అమ్ముడు, ఇట్టి తెగుబడి.

అమ్మక్క } (అబ్బురమందగునది) చూ, ౪ అక్క
అమ్మచెల్ల }

అమ్మనబోఁట్లు = (దొంగతొత్తులు)

అమ్మనములు } (ఆడుబిడ్డలాడుకొను నొక యాట.)
అమ్మనలు } చూ అంజి.

౨ - (అమ్మనలాడు పనిముట్లు)

అమ్మరో } (అబ్బురమునందగునది.) చూ, ౪. అక్క.
అమ్మరో }

అమ్మవారు = (ఆఁడువేల్పు)

౨ - (కొనియాడఁదగిన పాఱునమ్మ)

అమ్మాయి } (చిన్నపాప) ఆఁడుపాప చిన్నది, పడుచు,
అమ్మి } పిన్న పాప, పిల్ల

అమ్మిక = (కొండరాచూలి) కటిచేడియ కల్వలదొరదాలి కొండమాలి కొండరాచూలి, కట్టుపట్టి కట్టురాచూలి కట్రాచూలి, కట్లకేనిబిడ్డ గౌరు,జగముతల్లి మలయమ్మ ముక్కంటికెలది కలిమలకూఁతురు వెనకయ్యతల్లి వేల్పుటేటిసవతి సామితల్లి సామిసామేన చేకొన్నచాన

అమ్మించు = (అమ్ముడుచేయించు.)

అమ్ము = (వింటికోల) చూ, అంప

౨ - (అమ్మకముచేయు) విలుచు, విల్చు జట్టియిచ్చు పోకడ పెట్టు

అమ్ముడు = చూ, అమ్మకము

అమ్ముడువోవు = (వెలవోవు)

అమ్ముడువోనిగెలు = (ఒకదినుసు కల్లు)

అమ్ములు = (వీఁపుసందలి గోటినాటులు.)

అమ్ముపేటునేల = (కోలపోయి పడునంత దవ్వుగలనేల) వింటిపట్టు

అమ్మొత్తు = (ఒత్తుకు) చూ అదుముకు

అమ్మోయి = (అలాగున - ఆ మేను)

అయ = (తండ్రి) చూ ౨ అప్ప

అయగారు, అయవారు } (అయ్యవారు) అయ్యగారు అయ్యావారు ఒజ్జ ఓజ, చదువులయ్య పంతులు

౨ - అయ్యగారు అయ్యావారు.

3 - (కొనియాడఁదగిన పాఱుఁడు) అయ్యవారు.

అయారె, అయారే } (అబ్బురమునందగునది) చూ ౪ అక్క

అయితి = (అలవి) అలవి ఐతి కొలఁది కొద్ది తరము వల్ల

అయితేన్ = (అట్లయితే)

అయిదు = (నాలుగున్నొకటి) అరపది ఏను ఐదు చవ్వంచ, చౌవంచ చౌవంచి.

అయిదుగురు = (అయిదుమంది) ఏగురు ఏవురు ఐదుగురు

అయిమువదిచేయు = (వెనుదీయు) అలఁగు ఈడఁబోవు, ఈమఁబోవు ఐదుపదిచేయు ఓటుపడు, ఓడు ఓహటించు ఓహటిల్లు కొంకు క్రుయ్యఁబాఱు క్రుయ్యు, చెంగు చొలయు జుమఁగు, జాఱుఁగు తగ్గు తిరుఁగు తిరువు తగ్గు తిఱుఁగివియు పిఱుతివుచు, పిఱుదీయు, పిక్కు పిఱుపడు పిఱువోవు పిఱుసన మసలు, మాఱుమొగముపడు ముందరదుగుకెనుకపెట్టు మొగతప్పు మొగతిరుగు, మొనదప్పు లొంగు, లోఁగు లోవు విఱుగఁబడు విఱుఁగు వీఁగు, వెనుకంజవేయు, వెనుకదీయు వెనుకద్రొక్కు వెనుకముందగు, వెనుదీయు వెన్నిచ్చు సొలయు సుర్రిక్కు

౨ - (చేమోడ్పు) ఎరఁగు ఎఱఁగు ఐదుపదిచేయు, చేమోడుచు చేమోడ్పు చేదిచ్చు మొక్కు

అయిదువ, అయిదువరాలు } (మగనాలు.) ఐదువ ఐదువరాలు కొత్తడి, మగనాలు, మిక్కిణ, ముగతి ముత్తైద ముత్తైదువ ముత్తో.

అయిసన్ = (ముందు చెప్ప బడినదానికి మాఱుగా నింకొక దానిని చెప్పుటకు దెలుపును) ఐనన్

అయినిల్లు = (నట్టిల్లు) ఐనిల్లు నట్టిల్లు

అయివు = (తప్పు) అవగడము అగడము ఎగ్గు ఐవు, ఒప్పమి, ఒకరు కిల్ల కీడు గొడవ డొగరు తప్పితము తప్పిగము తప్పు తీఁపురము దండగము దండతీకము, దుడుకు నెపము నెరసు నెవము నేరమి నేరము నేసము వంక సొంటు

అయిపోవు = (ముగియు) ఐపోవు కడచన కడతెగు, కడతేఱు కడముట్టు, కడకొల్లు తేఱు ముగియు ముట్టు, మూఁడు సరిపోవు

౨ - (వెచ్చమైతీఱు) ఐపోవు చెల్లు

అయిమూల = (మూలవాటు) ఐమూల

అయిర = (ఒకానొక కంటిజబ్బు) ఆవిరి ఐర, కంటి కలక కలక కాయ

అయిరగొను = (చక్కఁబడు) చూ, ౪ అత్తు

అయిరేని = (ఐచ్చేనపనిచేసిన పెండ్లికుండలు) అరిమెన కుండలు, అతిమెనకుండలు, ఐరేని ఐరేనికడవలు జాజుగులు భూజెగులు భూజెకుండలు పెండ్లికుండలు బుడ్లు బూజుగులు

అయిలారము = (ఒకానొక మందువేరు) ఐలారము.

అయివచ్చు = చూ, అచ్చివచ్చు

అయో = (అకటా) చూ ౭ అంగడ

అయ్య = (తండ్రి) చూ ౨ అన్న

౨ - (కొనియాడదగినవాడు) చూ ౨ అయ్య

అయ్యగారు = చూ అయగారు.

అయ్యయో
అయ్యయ్యో } (అకటా) చూ ౭ అంగడ

అయ్యర
అయ్యరే } (అబ్బురమందగునది) చూ ౪ అక్క

అయ్యలు = (అకటా) చూ ౭ అంగడ

అయ్యవారు - (పాఱుడు) ఇరుముడిపు జన్నిగట్టె దగపుట్టిక నేలవేలుపు పాఱుడు పాఱువాడు బాపడు బాపనయ్య బాపనవాడు బాపనడు మిన్నులచదువరి

౨ - (చదువు చెప్పువాడు) చూ ౨ అయగారు.

అయ్యారె
అయ్యారే } (అబ్బురమునందగునది) చూ ౪ అక్క

అయ్యల్లి = (కోమటి)

అయ్యెన్ = (అయినప్పటికిని)

అయ్యెడన్ = (అప్పుడున్) చూ, అందన్.

అయ్యెడిన్
అయ్యెడిని
అయ్యెడు
అయ్యెడున్
అయ్యెడును } (అగుగాక యనుట యందు వచ్చును.)

అయ్యో
అయ్యో } (అకటా) చూ ౭ అంగడ

అర = (సంగోరు.) చూ ౧ అద

అరక = (మూపు) అఱక, అఱకడ, అఱకడము, కొప్పెము పంచ మూపు

౨ - (నేలనదున్ను పనిముట్టు) ఏరు నడక

అరకట = (కంటికి నొకవైపు)

అరకాడు - (పైరుపెట్టువాడు) కమతకాడు, కమతీడు కమ్మతీడు కాపు దుక్కిముచ్చు పంటకాపు రయితు రహితు రైతు సేద్యకాడు

అరకాలు = నట్టడుగు - అరగాలు(గి)ండియడుగు)

అరగడము = (ముసలివాడు) డొక్క డొక్కు పక్కు పన్ను, పెద పెద్ద ముతుక ముత్త ముది ముదిమివాడు, ముదివాడు ముదిసినవాడు ముదుక, ముదుకడు ముదురు ముదునరి ముసలి ముసలి ముసలివాడు

అరగన్ను = (సగము మూయబడిన కన్ను)

అరగలి = (అఱవఱ) అరవర అరమరము, అరమరిక, అఱ అఱమరి తరియాట నొడలొంటి పానలు, మరికిరాము మెరమెర పెడజాణతనము.

౨ - (పెడమోము) కొదుకు కొదుగు, జుకుగు జూకుగు పెడము పెడమోము మాఱుమొగము వెనుతిరుపు

3 - (కలి)

అరగలిగొను = (తరియాడు) చూ అంజాయించు.

అరగు = (తిన్నె) అరుగు అఱుగు జగతి జగిలె జగ్గిలె జవిలె తిన్నియ తిన్నె తీనియ తీనె

అరగడి = (కొఱచగోడ)

అరగూడు = (గోడయందేర్పఱచిన గూడు)

అరచట్టి = చూ, అంగరక

౨ - చూ అంగవస్త్రము

అరచెయి
అరచేయి } (లోచెయ్యి) అఱచెయ్యి అఱచేయి లోచెయి, లోచెయ్యి

అరచుట = (మొఱపెట్టుట బొబ్బపెట్టుట)

అరజాట్టు = (ఒకదినము పందెపు కోడిపుంజు - అందలి భేదములు) ఈకెలదారము కంచుడేగ కాకిచుక్క కోడిడేగ కక్కెకోళులది కంద్రగొద్దె గరుడంబు గాజులగానుగు జెట్టి తెల్లయిరకపిల్లవేరిల్లది నల్లయురగ, పండెట్టది పట్టుమార్పుది పట్టెజాట్టుది పింగళి, పిరంగి మూగచిట్టుకోడి పుంజులవేసవిత్తు రణభేరి రావుత్తి వసులపాలఁటి సెనకాలుది

అరఁటి = చూ అంటి

అరడ = (ఏఱుదాటఁదగిన తెప్ప - అందలి భేదములు) బోగు పాది ప్లుట్టి సంగడి సంబాగుప్ప పారిగోలు.

అరడా = (శత్రువులయొక్క మొదట కల్గెడు నగ) దుప్ప

అరణము = (అల్లునకుఁ గూఁతునకు మామయిచ్చెడు కానుక)

అరతన్ = (దగ్గఱలో) అఱుతన్

అరదండ = (రెండుచేతులకుఁ దగిలించెడు సంకెల

అరదము = (తేరు) తేరు బండి

అరప = (మీఁద గార్చుండునట్టి దేవాలయమైన చిన్న చప్పరము) కురుజు తిమగము పంచియ పంచె

అరపది = చూ అయిదు

అరపమీసలు (పండిన మీసములు)

అరవు = (వ్రాఁగికాళ్లనైతాల్చుల యుఱుపు) అందె అఱుపు

అరవరానిది = (పిలువరానిది)

అరవుట = (దక్కుట)

అరమర
అరమరము } (పాడలు) చూ ౧ ఆడికలి
అరమరిక

౨ - అఱ అఱమర అఱమరిక ఎడ ఎడమడుగు ఎడమడుపు ఎడవు ఒడుదొడుకు చిరమర పెనపు పొరపు బెరుకు మెరమెర, రెండు వాసి లింగడము విపాటు వేర్పాటు వేఱడము వేఱిమి వేఱు వేఱుపాటు వేఱుబంకము

అరమీటుమొన = (కత్తిపెనఁకువ) చూ అంజమెడపట్టు,

అరముడి = (మాటిమాటికి)

అరమోడ్పుట = (సగము మూయుట)

అరమోముచేసికొనుట = (మోము త్రిప్పికొనుట)

అరయించు = (వెదకించు)

అరయిక = (వెదకుట - అరయుట)

అరయు = (వెదకు) అరయు ఒరయు, గాలించు, గుర్తించు దేవు తడవు దెవకు, పరికించు రోయు, వెతకు వెదకు

౨ - (వగచు) అరయు ఒరయు తడవు పరికించు, పాటించు వగచు, విచారించు

అరలువడు = (సగమగు)

అరవ = (కొండమీఁది దారి) తురవ దుగువ సరవ

అరవడి = (అప్పు) చూ ౧ అచ్చుదల.

అరవరలు = (తునకలు) అరవుడు అరవుడు, అఱవఱలు, ఇండె ఇసుపు ఈరికె కనియ గండవలు, గండ్రెలు, గండ్రా గనియ గవె చక్కు చిందఱ చిందఱవందఱ చిదుర చిప్ప చీరిక చీలిక చెక్కు తుంట తుండము తుంపు తుండె తుండెము తునక తునియ తునుక, తునియ తునుకలు తుత్తుంపు తుత్తుంపులు నుగ్గు నెఱియ, నెఱె నెఱ్ఱియ నెఱ్ఱె పచ్చడి పఱియ పలియ పఱె, పఱ్ఱియ పఱ్ఱె పలుకు పల్కు పాళ పిప్పి, బద్ద బద్దె బిల్ల బిద్దె బిద్దెలు ముక్క, మునియ ముఱి మొఱికె మొఱ్ఱిక మోసు రక్క వందఱ వకవకలు, వకావకలు వ్రక్క వ్రయ్య, వ్రయ్య వ్రయ్యలము.

౨ - (ఎండినది) విట్టు విట్టు

అరవరి = చూ అప్పుడు కాఁపు

అరవాయి = (వేవిల) చూ అచ్చిక

౨ - (పిటికుంటెము) బాకడము పిటికికొండ, పుయిలోటు, పేచన్కి పేడఱిమి

3 - (జంకు) కొట కొంకు, కొఱుకు కోసరు, జంకు పుయిగోట పుయిగోటము బిమ్మటి, ముదముద, మొగమాట మోటము మోమోటు, మోమోటము.

అరవాయిగొను = (పిటికియగు)

౨ - (జంకు) అలఁగు ఓటిల్లు ఓడు, కొంకు కొంకించు, కొంచు కొంకు కొరుకు కొరుకుపడు, కొదుకు కొసరు గగ్గు గుర్రిక్కలు గ్రుంగు గ్రుక్కిళ్లుగ్రుంగు జంకు భయిలోడు ముడుఁగు మొగమోడు మోమోడు వెనుకదీయు సుర్రుక్క

అరవిరి = (మొగ్గ) నన భూమొగ్గ మొగ, మొగడ మొగ్గ

అరవీసము = (వీసమెత్తులో సగము)

అరవుడు = (ముక్క) చూ, ౧ అరవరలు

అరసావు = (మైమఱపు) ఒల్లము కళ కళబుట్టుట, చొక్కు బిలిలి బాలి, బిర్రిమరి, మెయిమఱపు మేను రువు మైమఱపు సుమాళము సొమసి, సొమ్మ సోరగు, సొరుగు, సొలగు సొలపు సొలిమిడి

అరసించుట = (వెదకుట)

అరి = (పన్ను)

౨ - (అల్లెత్రాడు) అల్లియ, అల్లె ఎక్క ఎక్కుడు, తెగ నారి మోపు వల్లియ

3 - (అమ్మెక్కపెట్టుటకనువగు యల్లెనడుము)

అరికట్టు = (ఆటంకపెట్టు) చూ అంకిలిపెట్టు

౨ - (చుట్టివచ్చు) ఉమ్మలించు ఒమ్ము ఒలయు కమ్ము క్రిచ్చు క్రిచ్చుకొను గిఱికొను గుండుకొను గువ్వకరికొన, గువ్వకోలుకొన, గువ్వకోల్కొను చుట్టివచ్చు చుట్టు చుట్టుకొను చుట్టువాఱు తట్టుముట్టాడు తిరిగివచ్చు, తిరుగు, తిరుగువాఱు తిరువు, తిగ్గ దాపలించు పరవంజు పరిగొను, పిరిగొను, పొదిగొను పోఁగువాఱు, ప్రిమ్ము బలయు మేఁగు మేవు, మ్రేఁగు, లేడించు

అరికల్లు = (దుప్పటి మెలిపెట్టి రెండుజబ్బలయందును జందెపువాటుగావైచి కట్టినకల్లు)

అరిగ = (డాలు) చూ, ౧. అడ్డనము

౨ - (తోలుపలక)

3 - (ఒక కితాబు)

అరిగావు = (కట్టుకావలి)

అరిగాఁవు = (కప్పము నొసంగువాఁడు)

అరిగాళ్లు = (గుమ్మముయొక్క గుజ్జుపు పీటలకు వెనుక వైపున నాఁతగానుంచెడు కమ్ములు) నిలువులు.

అరిగిపోవు = (తరుగు - తక్కువగు)

అరిగె = (ఏలికగుఱుతు)

అరిగొను = (అడ్డుకొన) చూ, అంకిలిపడు

అరిగోలు = (ఏఱుదాటించుపుట్టి) చూ అరడ

అరిజ = (ఒకదినుసుచేఁప)

అరిణ
అరిణు } (దోని) దోని, దోనియ దోనె.

అరితి = (కూరిమి) చూ, ౧ అంటు

అరితోసి = (వింటినారియొక్క నడిమికట్టు) అరిపోసి కూర్పరి.

అరిది = (నిక్కము) చూ ౧ అక్కజము

౨ - (వీలుకానిది) చూ 3 అక్కజము

3 - (పొందరానిది) కడిఁది, గగనము గొట్టు బంగారము, బంగారు, బాఁతి, బ్రాఁతి, మంది వెక్కసము.

౪ - (ఓర్వరానిది.) డెప్పరము దెప్పరము, వెక్కసము.

అరిపడు = (అడ్డగు) చూ అంకిలిపడు

అరిపె = (ఒకదినుసుయొక్క-అంపలివేయుడములు) కల్లెక్క చూరలుక

అరిపోసి = చూ అరితోసి

అరిపెట్టు = (కప్పుకట్టు)

అరిపోయు = (విల్లెక్కుడు)

అరిమి = (బిడ్డలకు గొంతులోఁ గలిగెడు జబ్బు) చూ, అంగిటిముల్లు

అరిమెనకుండలు = చూ అయిరేని

అరిసె = (ఒకానొక పిండివంట) అతిసియ, అతిసె

అరుఁగు = చూ, అరఁగు.

అరుగు = (పోవు) అరుగుదెంచు అరుదెంచు అగ్గ ఎలు, ఏగు ఏగుదెంచు, ఏతెంచు, చను, చనుదెంచు చాగు, తరలు, తర్లు తూఁగు తొలఁగు, త్రోచు

ఇంగిలికము
ఇంగిలీకము } (ఒకానొక మందుదినుసు)

ఇంచించుక = (కొంచెకొంచెము)

ఇంచిమంచి = (తియ్యని తినుబడిదినుసు)

ఇంచు = (చెఱకు) ఇంచుమాత్రు కన్నులమండ, కన్నుల మాత్ర, చెఱకు చెఱుకు తియ్యమాను, తియ్యమ్రాను తుంట ముత్తెపు బంట

౨ - (ఇంపగు) పట్టు

3 - (అందమగు)

౪ - (కోరు) కోరు తివురు, మరగు వలచు వేఁడు వేడుకపడు వేడుక సేయు

ఇంచుక
ఇంచుకంత } (ఒకింత) ఇసుమంత ఒకింత

ఇంచుట = (ఎప్పుట)

ఇంచుపాలకడలి = (చెఱకుపాకపు మున్నీరు)

ఇంచుఁబోఁడి = (చెఱకువలె నందమగు నాఁడుది)

౨ - చూ అతివ

ఇంచుమించు = (ఎప్పుడొక్కు) ఉరమరికి, రమరమి రమారమి

ఇంచుమాత్రు = చూ ౧ ఇంచు

ఇంచువిలుతుఁడు = చూ అలరువిలుకాఁడు

ఇంజేటి = (ఒకదినుసు కంద) ఈఁజేటి

ఇంటరము = (ఇఱుకు)

౨ - (ఇక్కట్టు) చూ అసరు

ఇంటాతఁడు = (మగఁడు) ఇంటియాతఁడు, ఒడయఁడు ఒడయుఁడు చెలువుఁడు పెనిమిటి పెన్మిటి మగఁడు మగవు ఱేఁడు, సామి

ఇంటికాఁపు = (ఇలుదొర) ఇంటివాఁడు ఇంటిదొర ఇలు ఱేఁడు కాఁపు మనికిఱేఁడు

ఇంటికిఁగాకపోవుట = (ముట్టగుట)

ఇంటిపట్టు = (పెండ్లము బిడ్డలతో నింటఁగాఁపురము సేయుచు పెద్దలు చెప్పినట్లు చేయుట)

ఇంటిపావ = (వెలకుఁగొన్న బానిస)

ఇంటియాతఁడు = చూ ఇంటాతఁడు

ఇంటిల్లిపాది = (ఇంటిలోనివారందఱు)

ఇంటివాఁడు = చూ, ఇంటికాఁపు

ఇంట్రిపడు = (ఇక్కట్టుఁజెందు) కక్కసపడు, గుజగుజ లాడు గుజగుజవోవు గుజగుజలువోవు, చిక్కుపడు, చిక్కువడు తొక్కటపడు, తొక్కటుపడు, నలి గొను, ముట్టుపడు

ఇంట్రిము = (ఇక్కట్టు) చూ, అసరు

ఇండు = (ఈఁతచెట్టు) ఈఁత ఈద ఈఁదు, చిట్టీత, చిట్టీఁదు

ఇండుపుకాయ = (బురదనీటిని తేర్చు నొకదినుసు గింజ)

ఇండులు = (ఇండ్లు)

ఇండ = (చీలిక) చూ ౧ అరవరలు

౨ - (ఎముకకీలు)

ఇండవాయు = (చీలు) ఇడియు చిరుఁగు, చిరుఁగు, చీలు పగుల్లువాఱు పటియువాఱు పాయవడు పి కులు పిక్కటిలు పిక్కటిల్లు పిగులు పీలు బీటగిలు, బీటగిల్లు బీఎలువాఱు బీటలువోవు విచ్చు, విరి వాయు వ్రియ్యఁబడు వ్రియ్యవాఱు వ్రియ్యు, వీ్రలు

ఇంత = (ఈకొలఁది)

౨ - (ఇదియంతయు)

ఇంతకుమున్ను = (ఇంతకంటె ముందుపోయిన రోజులం)

ఇంతంతనరానిది
ఇంతంత యనరానిది } (కొలఁత కందనిది)

ఇంతటనుండి = (ఇప్పటినండి)

ఇంతంత = (ఇంతఅంత)

ఇంతవట్టు = ఇంతవఱదాఁక) ఇంతవడి, ఇందనుకన్, ఇందాకన్

౨ - (ఈ కొలఁది) ఇంతియ ఇంతె ఇంతే

3 - (ఇదియంతయు) చూ ౨ ఇంత

**ఇంతవడి** = చూ ఇంతవట్టు

**ఇంతరింతలు** = (ఇంతింతలేసి)

**ఇంతలు** = (ఇంతలేసి)

**ఇంతి** = (ఆఁడుగి) చూ అతివ

**ఇంతియ**<br>**ఇంతె**<br>**ఇంతే** } (ఈకొలఁది) చూ, ౨ ఇంతవట్టు

**ఇంతికాపుంజా** = (తూరుపుచుక్క) ఒడలిచూ పొడయఁడు ఒడలుచూపొడయఁడు, కతి, కొండ పగతుఁడు, కొండఱెక్కలుగొట్టినదణి గట్టుదాయ, జేజే, తలఁపు టాయి సంతరించినదొర తూరుపువణి, తూరుపుచుక్క తెలిగంటిచుక్క, నిక్కువీనుల జక్కిసెక్కరాతు, నిలువెల్లజూపుతె వెలయువాఁడు, బటువాల్రియఁడు, బాసవాల్దొర, మబ్బురవుతు మలగొంగ, మైఁగనురా, వినువొర్లిదొర, విస్పుటెప్పలచుక్క, వెన్నునన్న, వేగన్నలసామి, వేగంటి, వేలుపుచుక్క, వేల్పుచుక్క

**ఇంద** = (ఇచ్చటనే)

**ఇందన్** = (ఇచ్చటన్)

**ఇందనుకన్**<br>**ఇందాకఁ** } (ఇంతవఱదాఁక)

**ఇందలి** = (ఇచ్చటనున్నట్టి)

**ఇందాఁక** = (ఇంతకుముందు)

**ఇందము** = (ఇదిగో తీసికొనుము)

**ఇందఱు** = (ఇంత ముస్తమువారు - ఇంతమంది)

**ఇందున్** = (ఇచ్చటన్) ఇక్కడన్ ఇచటన్, ఇచ్చటన్, ఇయ్యెడన్, ఈడన్

**ఇందు** = చూ, అడగారు

౨ - చూ, అవటిల్లు

**ఇందుగు** = (చిల్లగింజ) ఇందువు, ఇన్నుగ, చిల్ల చిల్లగింజ

**ఇందుప్పు** = (ఒకదినుసు ఉప్పు) చెందుప్పు

**ఇందులకున్** = (ఇచ్చోటికి)

౨ - (దీనికి)

**ఇందువు** = (చిల్లగింజ) చూ, ఇందుగు

**ఇంపగునది** = (సొగసైనది)

**ఇంపారుట** = (సొగసుగాంచుట)

**ఇంపితము** = (ఇంపైనది)

**ఇంపు** (వేడుక) చూ, అలరు

౨ - (కోరిక) చూ, ౧ అక్కఱ

3 - (సొగసు)

**ఇంబు** = చూ, ఇంపు

**ఇంపొలయు** = (సొగసుగాంచ)

**ఇఁకన్**<br>**ఇఁగన్** } (ఇంతటినుండి)

౨ - (మఱల) చూ, అప్పటి

**ఇక్క** = (ఇల్లు-ఉండెడుతావు) ఇమ్ము ఇరవు, ఇరవుపట్టు, ఇలు ఇల్లు ఉనికిపట్టు - టెంకి తావలము తావు, తిరుమాలిగ, తెంకి, తొట్టికట్టు, దీయము, తీము, నట్టు, నెలవు, ఉనికిపట్టు, లోఁగలి, లోఁగిలి, పాల.

౨ - (తావు-చోటు) ఇక్కువ ఇమ్ము ఇరవు ఇరవు, ఉనికి యెడ ఎడము కంగవ, కందువ, కట్టు, కడ, కలకు, కలన, కలిమి కన్మి గరిడి, చక్కటి, చక్కి, చేపట్టు, చో, చోటు, టెంకి, తావలము, తానకము, తావు, తెంకి నట్టు నిట్ట నిలుకడ, నిల్కడ, నెట్టు, నెప్పు నెల నెలకువ నెలవు, నేల, పట్టు, పొలము, మట్టు, మనికి, మన్కి, కలిగి, సీమ

**ఇక్కట్టు** = (చిక్కు) చూ, అసరు

**ఇక్కడఁ** = చూ ఇందున్

**ఇక్కము**<br>**ఇక్కపాటు** } (ఇఱుకుపాటు) చూ, అసరు

**ఇక్కువ** = (తావు) చూ, ౨ ఇక్క

౨ - (ఉనికి)

3 - (జాడ) చూ, ఆచూకి

౪ - (మెఱుఁగులతావు)

ఇగము = (మంచు) ఇవము మంచు

౨ - (చలువ) ఇవః ఇవతాళింపు ఇవము, ఈము చలవ చల్వ చలి, చలిమిరి చన్మిరి, చలువ చలువడి చల్ల చల్లఁదనము చల్లన జలుబు జలువు తెమ్మ తన్వ పేరిణము వలి వలిపిరి సీతు సీతువు

ఇగరఁబెట్టు = (ఇంకునట్లు చేయు)

ఇగిరించు = (చిగిరించు) ఇగురుకొను ఇగురుచు, ఇగురొత్తు ఇగుర్చు ఇగుర్చు ఇవిరించు ఇవురుచు ఇవుర్చు చిగిరించు చిగురుకొను, చిగురుచు చిగురొత్తు చిగుర్చు తలిరుచు తలిర్చు ననయు, ననుచు, మొగ్గ విచ్చు

౨ - (ఎఱ్ఱనగు) ఇవిరించు చిగురుచు చిగుర్చు

ఇగిరిక / ఇగిరికె } (నిప్పులో వేల్పుటకై యిగురఁబెట్టిన యాగిరము) నిగిరిక

ఇగిలించు = (పండ్లను వెలిపఱచు) ఇగులుచు ఇగుల్చు ఇవులుచు ఇవుల్చు

ఇగిలింత = (ఇగిలించుట)

ఇగురు = (మొలక) ఈరిక నవుు మొక్క మొటిక, మొట్టిక మొలక మొలవ మొల్క మోక మోటిక మోసు మోసరిక మోసు మోసిరిక మోవిడు

౨ - (చిగురు) ఇవురు ఈరిక చిగురు చిదుము చివురు తలిరు నన

౩ - (పండ్లచుట్టునుండు కండ)

౪ - (ఇంకు) చూ అడుగంటు

ఇగురుఁబోఁడి = (చిగురువలె నందమైన యాఁడుది)

౨ - చూ, అతివ

ఇగురుకొను / ఇగురుచు / ఇగుర్చు / ఇగురొత్తు } (చిగిరించు) చూ ౧ ఇగిరించు చిగురొత్తు

ఇగులుచు / ఇగుల్చు } (పండ్లను వెలిపఱచు) చూ, ఇగిలించు

ఇగురువిల్తుఁడు — చూ అలరువిలుకాఁడు

ఇగో౯ = (చూపును దెలిపెడి) ఇదిగో౯, ఇదిగో౯, ఇదియ ఇదె

ఇగ్గు = (వెనుకకొఱగు)

ఇగులాట = (ఇగ్గులాడుట)

ఇగ్గులాడు = (వెనుకతీయు)

ఇగుర్చు = (చిగిరించు) చూ ౧ ఇగిరించు

ఇచట౯ = (ఇచ్చట) చూ, ఇందు౯

ఇచ్చకము = చూ ౨ ఆచ్చిక బుచ్చికము

౨ - (నెమ్మి) చూ, ౧ అంటు

ఇచ్చకాలమారి / ఇచ్చకుఁడు / ఇచ్చగొండి } (ఇంపైన మాటలాడువాఁడు)

ఇచ్చట౯ = చూ ఇందు౯

ఇచ్చిపుచ్చుకోలు = (ఇచ్చి పుచ్చుకొనుట)

ఇచటు / ఇచోటు / ఇచ్చటు / ఇచ్చోటు / ఇచ్చోటు } (ఈతావు)

ఇచ్చు = (ఇడు - ఒసఁగు) చూ, ౮ అమ్ము

ఇజారా = (గుత్త) గుత్త గుత్తగ గుత్తక

ఇజారు = (కాలికిఁ దొడిగికొను చట్టు) హిజారు

ఇజ్జు = (ఇక్కట్టు) చూ అనయు

౨ - చూ అతల కుతలము

ఇట = (ఇక్కడ)

ఇట౯ = (ఈవల)

ఇటఁబట్టి / ఇటమీఁద౯ } (ఇది మొదలుకొని)

ఇటు / ఇటులు } (ఈలాగున) ఇటువలెన్, ఇట్టు ఇట్టులు ఇట్టు వోలెన్ ఇట్లు

ఇటువంటి = (ఇట్టి)

ఇటువలెన్ = చూ, ఇటు

ఇట్టలము = (గట్టి) ఉక్కు, ఉదుటు, ఉదిరి, ఉజిది, ఊటు, ఒఱపు కటికి, కొదమ, గట్టి, చేగ, చేవ తరపు దిటము, దిటవు, దిట్ట, నేటు, పదిలము, బటువు, బిగి, బిగువు, బిగితము, బిట్టు, బిఱ్ఱ బెట్టిదము, రటము, సదాటు

౨ - (హెచ్చు) చూ, ౮ అంకపొంకములు

3 - (పొలుపు) ఇరవు ఉజిది, జితము, పొలుపు, పొల్పు

ఇట్టి = చూ, ఇటువంటి

ఇట్టు
ఇట్టులు } చూ, ఇటు
ఇట్టువోలెన్

ఇట్టీఁడు = (ఇటువంటివాఁడు)

ఇట్టలు = (దాటులు - పేరిములు)

ఇట్టువు = (ఒకానొకచెట్టు) జొట్టువు, దుట్టువు, దుట్టువు

ఇట్లు = చూ, ఇటు

౨ - (ఇఁకమీఁద జెప్పఁబోవునట్లు)

ఇఁడి = (లేనిదానియందువచ్చు పెచ్చుమాట)

ఇడి = (ఒకానొక పిండివంట)

ఇడుకుడక = (ఒకానొక పిండివంట)

ఇడియఁగొట్టు = (పోఁగొట్టు)

ఇడియు = (ముక్కలగు) చూ, ఇండేవాయు

ఇడు = (ఇచ్చు - ఒసఁగు) చూ, ౪ అచ్చు

౨ - (ఉనుచు)

ఇడుగడ = (ఒకరియందు చెడ్డనుపల్కుట-చెడ్డనెంచుట)

౨ - (కొద్దిపాటు)

ఇడువు = (ప్రక్క) చూ, ౧ అంక

౨ - (గోడకిరుప్రక్కల మీఁదివోటు) పాదికట్టు

3 - (చీలిక) చూ ౧ అరవరలు

ఇడుము = (కీడు) చూ, 3 అంకిలి

౨ - (ఇబ్బంది) చూ, ౨ అగబాటు

3 - (వగపు) చూ, ౪ అంగద

ఇడుమపాటు = (ఇడుమపడుట)

ఇడుముడి = (ఇబ్బంది) చూ, ౨ అగబాటు

ఇడ్డెన = (వాసెనకుడుము) చూ, అంగరొల్లెలు

ఇడుముకొను = (చుట్టిపైచికొను)

ఇతఁడు = (ఈతఁడు) ఈతఁడు, ఈయన

ఇత్తళి = (పచ్చని యొకదినుసు)

ఇత్తఱి = (ఇప్పుడు)

ఇత్రిగ = (రెండుమూఁడులు) చూ, ౧ అఱు

౨ - (పారలమీది మూఁడుబొట్లుజత) ఇద్దుగ

ఇది = (ఇయ్యది) ఇద్ది ఇయ్యది, ఈయది

ఇదిగో
ఇదిగోన్ } చూ, ఇగోన్

ఇదికదా = (ఇదియేకదా)

ఇదియ
ఇదె } చూ, ఇగోన్

ఇద్దరి=(ఈవలదరి) ఇవతల ఇవల, ఇవ్వల ఈతల, ఈవల

ఇద్దఱు = (ఇరువురు) ఇరుగురు ఇరువురు, ఇర్వురు

ఇద్ది = చూ ఇది

ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డఁడు = (పిళ్లారి) ఏనుఁగుమోముసామి, ఒంటికొమ్మువేలుపు కలుఁగులాయపుతేజి బలు సిపాయి కుడుముల తిండికాఁడు, కొక్కెరవుతు, కొక్కెరౌతు, కోడెటెక్కెమువానన్న గరికపూజల మెచ్చు గబ్బివేల్పు గుంజిళ్లు పెట్టించుకొను వేల్పు, గుజ్జువేలుపు, గొప్ప బొజ్జగలాఁడు, గొప్పమెయిపోఁడి, చేటచెవులవేలుపు, చేటవీనులదణి, టెంగనాసామి, పగడపంటిదొర, పనిచెఱుచువాఁడు, పనిచెఱుపువేల్పు, పాఁపజందెములమేటి, పాఁపజన్నిగట్టు, పిళ్లారి, పెద్దకడుపువేల్పు బొజ్జకడుపువేల్పు ముక్కంటి తొలిపట్టి, ముక్కంటి పండులమెక్కుడు దిండీఁడు, మొదటివేల్పు, మొట్టికాయల మెప్పు మొగ్రక్కువారలపనల్ జక్కఁజేసెడుసామి

ఇద్దుగ = (పాలిలమీఁది రెండుబొట్లజత) చూ, ౨ ఇత్తిగ

ఇద్దుము = (రెండుతూములు) ఇరుదూము

ఇని = (ఇంతయనుటకు పెక్కుపల్కు) ఇన్ని

ఇను = (రెండుమార్లు మూఁడుమార్లనుటకు తొలుతవచ్చు పల్కు)

ఇనుకు = (బొంతుచేతఁ గప్పఁబడిన కొంచెపువడ్లు) చింకలు

౨ - (ఇంకు)

ఇనుపకచ్చడము = (విత్తుబాఱకుండునట్లుండుట)

౨ - (ఇనుపగోచి)

ఇనుపగోలెము = (నిప్పులుంచెడు కుంపటి) కమటము, కమ్మటము, కుంపటి, కుమురు, బంగల, వయ్యంది.

ఇనుపచిట్టెము = (ఇనుము కాల్చగావచ్చిన తుక్కు)

ఇనుపకుందులు = (తలుపుబందులను నిలఁబెట్టునవి)

ఇనుపతేలు = (నల్లతేలు; ఎనుపతేలు)

ఇనుపదుడ్డు = (గునుపము) గుదుప, గుదియ, గుదె గునుపము దుడ్డు

ఇనుమడి =(రెండింతలు) ఇన్మడి, ఇబ్బడి ఇమ్మడి జంట జమిడి జమిలి, దంట, దుగ దువ, రెట్టి

ఇనుమడించు = (రెట్టించు) ఇన్మడించు ఇబ్బడించు ఇమ్మడించు రెట్టించు.

ఇనుమద్ది = (నల్లమద్ది) ఏపెచెట్టు నల్లమద్ది

ఇనుమనుమఁడు = (మనుమనికొడుకు)

ఇనుమనుమరాలు = (మనుమనికూఁతురు)

ఇనుమాఱు = (రెండుతడవలు)

ఇనుమిక్కిలి = (మీఁదుమిక్కిలి)

ఇనుము = (ఒకానొక నల్లనిదినుసు) ఇన్ము ఉక్కు

ఇన్ని = చూ, ఇని

౨ - (ఇవన్నియు)

3 - (ఇంత లెక్కగలవి)

ఇన్నుగ = చూ, ఇందుగ

ఇన్నూఱు }
ఇన్నూరు } (రెండువందలు)

ఇన్మడి = చూ ఇనుమడి

ఇన్మడించు = చూ ఇనుమడించు

ఇన్ము = చూ ఇనుము

ఇపుడు }
ఇపు } (ఇప్పుడు, ఇత్తడి)

ఇప్ప = (ఒకానొకచెట్టు)

ఇప్పటిది = (ఇత్తఱియందుగలది)

ఇప్పకట్టె = (ఒకానొక చెట్టుకట్టె)

ఇప్పనూనె = (ఇప్పపువ్వులనుండి తీసిననూనె)

ఇప్పపూరాజనములు = (ఒకదినుసు వడ్లు) చూ, అక్కుళ్లు

ఇప్పాట = (ఈలాగు) ఇమ్మెయి, ఈలాగు

ఇప్పించు = (ఒసంగఁజేయు)

ఇప్పికోలు = (ఇయ్యకోలు) ఇయ్యకోలు, ఈకోలు, ఈయకోలు, ఉంకు, ఒడఁబడిక, ఒడఁబాటు, ఒప్పికోలు, ఒప్పు ఒప్పుకోలు, కయికోలు కైకోలు, మంజూరు మయికోలు, మయివడి, మెయికోలు, మెయివడి, మేకోలు మేముడు మేముదు, మైకోలు, మైవడి, లాగు, సమకోలు

ఇప్పుడు = చూ ఇపుడు

ఇబ్బంది = (కీడు) చూ, 3 అఱ

౨ - (ఇరుకు) చూ, ౨ అగచాటు

3 - (మిక్కిలి కట్టుబాటు)

౪ - (అడవిపందికిని యూరఁబందికిని పుట్టినపంది)

ఇబ్బందిగాఁడు = (ఎలుఁగుబంటి) ఎలుఁగు, ఎలుఁగుగొడ్డు ఎలుఁగుబంటి ఎలుఁగుమంటి ఎలువు, ఎల్గు, ఎల్గువెలినోటి మెకము పుట్టుకాఁపు, పుట్టుకూటిమెకము, పుట్టకూడుదిండి పుట్టకూడుమెక్కు మెకము, బొచ్చు మెకము, బొల్లిమోర మెకము, మొగము తెలుపు మెకము,

లేదు వెనుకచూపుల మెకము, వెనుచూపుల మెకము వెలినోటిమెకము వెలుఁగుబంటి

ఇబ్బడి = (రెండింతలు) చూ, ఇనుమడి

ఇబ్బడించు = చూ ఇనుమడించు

ఇబ్బెద = (ఒకానొకచెట్టు)

ఇమిడిక = (లోఁదఁగుట) చూ, అడకము

౨ - (పొందిక) చూ ౩ అంటు

ఇముకలము = (వ్రాసెడు కలము) కలపకట్టియ, కలప కట్టె కలము పేనా

ఇముకుట = (ఇంకుట)

ఇముడు = చూ, అడగారు

౨ - (పొందుపడు) చూ అవటిల్లు

ఇముడుకొను = (ఇముడ్చుకొను)

ఇముడుచు } (ఇముడఁజేయు)
ఇముడ్చు }

ఇమ్మడి = చూ, ఇనమడి

ఇమ్మడించు = చూ ఇనుమడించు

ఇమ్ము = (వసతి) ఉసులు, పదిలము, పోడిమి, పోణిమి బులుపు వసతి సుకులు సుమాళము సొంపు, సోమ పోయి

౨ - (ఇల్లు) చూ ౧ ఇక్క

౩ - (తావు) చూ ౨ ఇక్క

౪ - (విరివి) ఒడ్డు గరుము తనరుప్ర తనర్పు నెరవు, నెఱవు పరప్ర పఱపు బాకి, విరివి, విరివిడి, వితివి, వెడఁద వెణఁద

౫ - చూ ౨ అందము

౬ - (అంతయు)

౭ - (చెలిమి) చూ, ౩ అంటు

౮ - (ఇంపు) చూ, ౧ అరజము

౯ - (వెరవు) చూ ౨ అనువు

౧౦ - (లిన్న) చూ, ౪ అనువు

౧౧ - (వెల్లడియైనది)

ఇమ్ముకొను = (ఉండు) ఉండు, కాపురించు, నడగొట్టు, నిలుచు, నిల్చు వేంచేయు

ఇమ్ముదప్పు = (చెడు) చూ, అసరు

ఇమ్మోయి = (ఈలాగున) చూ, ఇప్పాటు

౨ - (ఇమ్మేను)

ఇయ్య = (కోరిక) చూ, ౧ అక్కఱ

ఇయ్యకొను = (ఒప్పుకొను) ఇయ్యకొను, ఈకొను ఈయకొన ఒడఁబడు ఒప్పుకొన కొలుపు, డిందుపడు, నూలుకొన మియికొను

ఇయ్యకోలు = (ఒప్పుకోలు)

ఇయ్యసేయు = (ఒప్పుకొను)

ఇయ్యది = చూ, ఇది

ఇయ్యెడన్ = (ఇచ్చటన్) చూ, ఇందన్

ఇయ్యేఁడు = (ఈయేఁడు)

ఇరవారు =(నెలకొను) ఇరవుకొను, ఇరవుపడు, కుదురు, కుదురుపడు కుదుర్పడు, జితపడు, జితించు డెక్కొను తావుకొను, నాటుకొన, నెక్కొన, నెట్టుకొన, నెల కొన, నెలవుకొను పదిలపడు, పాదుకొన, పొందు కొను, పొలుచు

ఇరవు = (ఇల్లు) చూ ౧ ఇక్క

౨ - (తావు) చూ, ౨ ఇక్క

౩ - (పొలుపు) చూ ౩ ఇట్టలము

ఇరవుకొను } (నెలకొను) చూ, ఇరవారు
ఇరవుపడు }

౨ - (నిలుచు) కుదురుకొను, కుదురుపడు, కుదుర్పడు నట్టుకొను నిలఁబడు నిలుచు నిలుచుండు నిలుచు కొన నిలువఁబడు నిల్చు నిల్చుండు, నిల్వఁబడు, నూలుగొను నూల్కొన నెక్కొను, నెప్పుకొను, నెల కొన నెలవుకొన, పట్టుకొను, పాదుకొన, పాదు నిలుచు మట్టుకొను మట్టుపడు

ఇరవుపట్టు = (ఇల్లు) చూ, ౧ ఇక్క

ఇరస = (రెండుతూములు) ఇరిస

ఇరసాలు = (దొరవారిసొమ్ముపంపుట) ఇరుసాలు

ఇరసాలునామా = (పంపఁబడినసొమ్ము పట్టీ)

ఇరాఱు = (పండ్రెండు) ఈరాఱు నల్గిఁ, పండ్రెండు పదిరెండు బార, బారా, ముచ్చొకము.

ఇరివిలి = (పోగర - ఒకానొక కొంఱముట్టు)

ఇరు = (రెండు) ఈరు జంట దంట దుగ, దువ రెంచ రెంట రెండు

ఇరుకెలంకులు, ఇరుకెలఁకులు, ఇరుగడలు } (రెండువైపులు) ఇరుగెలఁకులు ఇరుచక్కియలు ఇరుపక్కియలు, ఇరుప్రక్కలు ఇరుబగులు ఇరుమయిలు, ఇరుమెయిలు ఇరుమేరలు ఇరువంకలు నూరెలు

ఇరుగు = (ప్రక్కయిల్లు) ఇరువు పొరుగు
౨ - (ప్రక్క) చూ, ౧ అంక

ఇరుగుడు = (ఒకానొకచెట్టు) ఇరువుడు, నల్లదిరిసెనము

ఇరురురు = చూ, ఇద్దఱు

ఇరుగెలఁకులు, ఇరుచక్కియలు } చూ, ఇరుకెలంకులు

ఇరుచాలుదుక్కి = (రెండుచాళ్లు దున్నినదుక్కి)

ఇరుతిగ = చూ, ౧ అఱు

ఇరుదలతేజి = (మేఁక - పొటేలు) చూ అడవిమేఁక

ఇరుదలపాము = (రెండువైపులను తలలుఁగలపాము) పూడుఁబాము

ఇరుఁదలపులుఁగు = (ఒకానొక పెద్దపులుఁగు) వీరఁగులదిండి

ఇరుదూము = చూ ఇద్దుము

ఇరువాలుగు = (ఎనిమిది) ఎనిమిది ఎన్మిది దచ్చపుక దచ్చి

ఇరుపక్కియలు = చూ ఇరుకెలంకులు

ఇరుపరువునేల, ఇరుపర్వునేల } (వాల్గు మైల్లు)

ఇరుకీవ = (మిక్కిలి కోపాడు) నిరుకీవ

ఇరుప్రక్కలు, ఇరుబగులు } (ఇరుకెలంకులు)

ఇరుఁబుట్టువు = (పాఱుఁడు) చూ ౧ అయ్యవారు
౨ - (పిట్ట) గువ్వ గుడ్డుకానుపు, పిట్ట పులుఁగు, పెట్ట

ఇరుమయిలు = చూ ఇరుకెలంకులు

ఇరుమూడు = చూ ౧ ఆఱు

ఇరుమెయిలు = చూ ఇరుకెలంకులు
౨ - (రెండుమబ్బులు)

ఇరుమేరలు = చూ ఇరుకెలంకులు)

ఇరుమెయి, ఇరుమేను } (రెండుమేనులు కూడిక)

ఇరులు = (చీఁకటి) కప్పు చీఁకటి, చీకువాలు, మబ్బు, మయిల మైల

ఇరులుకొను = (చీఁకటిపడు)

ఇఁరులుగొంగ = (ఎండదొర) ఇనముమేపరి ఇనము నూడు ఎండదొర ఎఱ్ఱనివేలుప ఏడుగుఱ్ఱముల తేరెక్కుజోదు కలన జావరుల తెన్ను కలువలదాయ, కలువలనూడు కాఁకవెలుఁగు కెంపురా, చలిదాయ, చీఁకటిగుండె దిగులు చీఁకటుల గొంగ, చెయూవుల సాకిరి జక్కవలయంటు జక్కవలతోఁడు జగము కన్ను జగముచుట్టము తమ్మిచక్కిలిగింత తమ్మిచుట్టము తమ్మిదొర తమ్మివాల్గంటిమగఁడు తమ్ములవిందు తావరచెలి తొగకొమ్మతొలఁగుబావ తొగనూఁడు, దుగపదిరూపుల దుండగీఁడు నెలజోఁడు పగటివేలుపు పగటివేవ్వ పగలింటిదొర పగలుసేయు వలంతి, పచ్చగుఱ్ఱము గలాఁడు పచ్చవారువపుజోదు, పచ్చవార్వపుజోదు పనులసాకిరి పొంజక్కిసామి పొద్దు పొద్దుఁజదువుల పెట్టియ పొద్దుఁబలుకుల పెంకి, పొద్దుఁబల్కుసామ్ము పెట్టె పొద్దు బారమేనులదొర, బారరూపుల వేలుపు మింటితెరువరి మినుకులబరణి మినుకుల యిక్క ముబ్బాసవాల్గము, మువ్వన్నెకోఁడు, మువ్వేలుపులయిక్క మెరుక్కుసాక్కుసామి మ్రొక్కులాసవలంతి రేకంటి రేవెల్గుజోదు, వినుకెంపు వెన్నునివలకన్ను వెన్నుని వలమూపు వెలుఁగుతోఁడు వేడి

౩ - ధూ ౧ అలి

ఇల్లి = (తిండికి కండ నుండుట) సంకు, నిట్ట, నిట్రి నిట్టురి నిప్పస్తు, నుంకు పస్తిల్లి పస్తు, లంకణము లంకనము

ఇల్లింద = చూ ఇలింద

ఇల్లిగులు = (మిక్కిలి కెనుకకొఱగుటలు)

ఇల్లిముక్కు = (పగిలి నెత్తురుకారెడి ముక్కు లోపలి వైపు)

ఇల్లు = చూ ఇక్క

ఇల్లెపుచేప, ఇల్లెము } చూ, అంబుపక్కర

ఇల్వడి = చూ, ౧ ౨ ఇలువడి

౨ - (ఇంటిగొప్ప) ఇల్వరుస

ఇల్వరుస = చూ ౨ ఇలువడి

ఇల్లెడ = (లోఁకువైనది)

ఇవక = (చెమ్మ) చూ ౨ ఇగము

ఇవతల = (ఈవైపు) చూ ఇద్దరి

ఇవతళించు, ఇవతాళించు } (చల్లనగు) చల్లపడు తనుపారు తనువడు

ఇవతాళింపు = (చెమ్మ) చూ ౨ ఇగము

ఇవము = (మంచు) చూ ౧ ఇగము

౨ - (చలవ) చూ ౨ ఇగము

ఇవముకొను = (తడియగు) తడియు తోఁగు నాను

ఇవముమేపరి, ఇవముసూఁడు } చూ ఇరులుగొంగ

ఇవల = చూ ఇద్దరి

ఇవిరించు = (చిగుర్చు) చూ ఇగిరించు

౨ - (ఎఱ్ఱనగు) చూ, ౨ ఇగిరించు

ఇవి = (ఇయ్యవి) ఇవ్వి

ఇవురు = (చిగురు) చూ ౨ ఇగురు

౨ - (ఇంకు) చూ అడుగంటు

ఇవురుచు, ఇవుర్చు } (చిగుర్చు) చూ ౧ ఇగిరించు

ఇవులుచు, ఇవుల్చు } చూ, ఇగిలించు

ఇవ్వల = (ఈవైపు) చూ ఇద్దరి

ఇవ్వలను = (ఈవైపున)

ఇవ్వి = చూ ఇవి

ఇసడిలు = (విసుగు) చూ, ౨ అలయు

ఇసిరో = (దూఱుటను తెలిపెడి) ఇసీ ఇస్సిరో, ఇస్సీ ఇహిహీ, ఈహీ హిహీ

ఇసిఱింతలు = (కదలిక) చూ, 3 అదరు

ఇసిఱింతలువాఱు = (కదలాడు) చూ, ౧. అటమటించు

ఇసీ = చూ ఇసిరో

ఇసుక = (ఒకటితోనొకటి యంటని పొడినూకలవంటి ట్టిదినుసు) ఇసుము ఇసులు, ఉసుక, కఱకుదుమ్ము

ఇసుకదాసరి = (ఒకదినుసు కూర)

ఇసుకదిన్నియ, ఇసుకదిన్నె } (ఇసుకదిబ్బ)

ఇసుకదొంత = (ఒకదినుసు చేఁప) చూ అంబుపక్కర

ఇసుకపులకండము = (ఒకదినుసుకలకండ) కండ పటికబెల్లము పులకండము పులుకండము

ఇసుకబేలు = (ఒకానొకతీఁగ)

ఇసుకమ్రాను = (ఉలిమిరిచెట్టు) ఉలిమిడి, ఉలిమిరి మాకెఁగ మొగలింగ

ఇసుమంత = (కొద్దిగా) చూ ఇంచుక

ఇసుమంతకాఁక = (గోరువెచ్చ) ఒకింతవేడిమి, కనువెచ్చ, గోరువెచ్చ, గోర్వెచ్చ, తనివెచ్చ, నులివెచ్చ, నులివెచ్చన

ఇసుము } చూ ఇసుక
ఇసులు }

ఇసుల్లు = (కొక్కెచెవలు) ఉసిల్లు ఉసుల్లు

ఇస్తువు = (సొమ్ము) సొత్తు సొమ్ము

ఇస్సిరో } చూ ఇసిరో
ఇస్సీ }

ఇహీహీ = (నవ్వుటయందగు మ్రోఁత) చూ అసురుసురు
౨ - చూ ఇసిరో

## ఈ

ఈ = (ఎదుటనుండుదానిఁ దెలుపును)

ఈండ్ర = (తాటిచెట్టు లోనగువానిగీఁచి బ్రతికెడుతెగ)

ఈండ్రము = (ఒత్తుడు) చూ, అదుముడు

ఈండ్రవాఁడు = (కల్లుగీయువాఁడు) ఈడిగ ఈడిగవాఁడు ఏతవాఁడు గవుండ్లవాఁడు గౌండ్లవాఁడు, చిటెగాఁడు మొక్కలి

ఈండ్రించు = (నలఁగుడువెట్టు)

ఈఁక = (పిట్టయెఱక) ఎఱక గఱి చట్టుప చెట్టుప డాఁక నెఱి రెక్క ఱెఁకు లాక

ఈకడ = (ఈవైపు)

ఈఁకు = (ఇంకు) చూ అడుఁగంటు

ఈకరణి = (ఈలాగున)

ఈకువ = (తడి) ఈమిరి ఊటు చెమ్మ చొదుగు తడి తనుపు తన్పు తెమ్మ తేమ తోఁగు నెమ్ము పంకెన పదను

ఈకె = (ఈబిడ) ఈపె ఈమె ఈబిడ ఈబిడె ఈయమ ఈయమ్మ

ఈకెలదారము = (ఒకదినుసు పందెపుకోడిపుంజు) చూ అరజుట్టు

ఈకోను = (ఇయ్యకోను)

ఈకోలు = (ఇయ్యకోలు - ఒప్పుకోలు)

ఈగడ = (బాడ) చూ ఆమూక

ఈఁగ = (ఒకానొక రెక్కలపురుగు) ఈఁగె, ఈవ ఈవె

ఈఁగపులి = (సాలెపురుగు) విందుపురుగు

ఈగి = (ఈవి) ఈవి ఒసఁగు చాగము తెగువ పుడికిరింత పుడిగ పుడుకరింత పుడుకు పుడుగ, పుణుకు పెట్టు పెట్టుడు విడుపు విడ్పు
౨ - (నాల్గువెరవులలోను రెండవది) ౧ మంచి, ౨ ఈగి ౩ వేఱు ౪ కొట్టు

ఈఁగు = (చొరఁబడు) ఎలయు ఒలయు కూరుకొను, కూర్కొను చొచ్చిలు చొచ్చిల్లు చొచ్చు చొత్తెంచు చొరఁబడు చొరఁబాఱు తటారించు తూకొను తూఱు దూయు దూఱు నడుచొచ్చు పొలయు లోఁగు లోవు
౨ - (మరలఁబడు) నీఁగు

ఈగికాఁడు = (ఇచ్చువాఁడు) ఈవరి ఈవికాఁడు చాగకాఁడు చాగి తెగుదారి విడుపరి

ఈగిమ్రాను = (అడిగిన నొసఁగెడిచెట్టు) ఈవులమ్రాను కడలికానుపు జాల్మొలక వెలుఁగంటిమ్రాఁకు, తెల్లమ్రాను పుడుకుమ్రాను పెట్టుఁజెట్టు మింటిచెట్టు, మెచ్చులచెట్టు వాడని పువ్వులమ్రాను వినమ్రాను, వెలిమ్రాను వేలుపుఁజెట్టు

ఈగు = (వెనుకకొఱఁగు) చూ ఇగ్గు

ఈగుట = (ఓడిపోవుట) చూ ఇఱుగుట
౨ - (పోఁగొట్టుట)
౩ - (ఓర్చుట)
౪ - (ఒదుగుట)
౫ - (డయ్యుట)
౬ - (దూరుట)

ఈఁగె = చూ ఈఁగ

ఈచ = (వంకర) ఈఱతాఱ ఏచ, ఏటవాలు ఏప, ఒరగు ఒఱగు ఒఱవ ఒత్తియ, కొంకర గోడి చొక్కలి చొట్ట డొంకు నెరి నెఱి నెఱులు మలఁక, రోటు వంక వంకర వంపు వాఁక సొట్ట
౨ - (వరియెన్ను తోడిమ) ఊచ

3 - (చేవలేమి)

ఈచకొనునది } (ఈచుఁబోయిన యావు)
ఈచుకొనునది

ఈచపడు } (వంకరయగు) గోడివడు చొక్కిల్లవవ్రు
ఈచఁబోవు } మలఁగు రోటువోవు వంకరవోవు

ఈచు = (పాడిపసు - పాలుయింకు-ఇంకు)చూ అడుగంటు

ఈచుకపోవు = (చావుదూడవేయు)

ఈఁజేరి = చూ ఇంజేటి

ఈఁటియ = (ఈఁటె) చూ అత్తలము

ఈటు = (పనికిమాలు) చూ ౫ అటుమటు

౨ - (ఉత్త) ఉత్త ఉళిక్కి ఎద్దడి కుండేటికొమ్ము గొడ్డు చెనఁటి చెన్నఁటి దోయిడ నిష్ప్రపరము బరిగి బయలు బీదు రుత్త లేబరము లొటారము వట్టి సోళు

ఈటువోవు = (వమ్మువోవు) చూ ౧. లఱడివోవు

౨ - (లేకపోవు)

ఈఁటె - చూ అత్తలము

ఈఁటెకాఁడు = (ఈఁటెఁబట్టినవాఁడు)

ఈడ = (నారింజ) దబ్బ నారదబ్బ నారింజ

౨ - (ఈవోటు)

3 - (ఒకదినసు యెఱ్ఱకిర్రి)

ఈడన్ = (ఇచ్చుటన్) చూ ఇందన్

ఈడఁబోవు = (వెనవీయు) చూ ౧ అయిదుపదివేయు

ఈడాడు = (ఎదురు - మార్కొను) ఎదిరించు ఎదురు ఎదురుకొను ఎదురుచు ఎదుర్చు చెనకు చెనయు డీకొను తలపడు తొడరు దాడియాడు డీకొన మార్కొన మాఱుకొన ముదలకించు ముదలించు వెండోడ్డు రాయు

ఈడిక = (గడ్డిగానగువానిఁ దెచ్చెడి బండిపరమువంటి కొఱముట్టు) చరుగుడు సరవడ

౨ - (కింపతొడుగు) ఊఁద ఎఱ్ఱము కింప, క్రింప, తొడుగఱ తొడుగట్టి తొడగు తొడువు తొడ్గు సుమము

ఈడిగ } చూ ఈంద్రవాఁడు
ఈడిగవాఁడు

ఈడిగిలఁబడు } (కాలుపు మొదలగువానిచే రానని మొండివేసికొని కూర్చుండు) ఈడ్గిలఁబడు
ఈడిగిల్లు

ఈఁడు = (కొన్ని పేరలయందు తుదనువచ్చెడిపల్కు)

ఈడు - (పరువము)

౨ - (పడుచుతనము) గోవ తఱపి పడుచుతనము పరువము పర్వు

3 - (తాకట్టు) చూ అగావు

౪ - (పోల్కి) చూ 3 అనుగలము

౫ - (బ్రతికియుండుతటి)

౬ - (వీడు) ఉరలు ఉరలుకొను ఊడు జాఱు, వదలు విడియు విడివడు విడివోవు, విడు విడువడు విరియఁబడు విరియఁజాఱు విరియు, వీడు, వీడుకొను, వీడ్కొను వీఁలు వదలు సర్వు

౭ - (నిగుడు) చాఁగు నిగుడు నిడువను.

౮ - (పాలుపిండు) పిండు పితుకు పిదుకు

ఈడుచు = (తిగుచు)

ఈడుపడు = (సరిపడు)

ఈడుపు = (లాగు).

౨ - (వ్రేలుట - జాగు)

3 - (గుంబమున కొకవైపు)

ఈడుపులు = (బుగడలగొలుసు)

ఈడుఁబోవు = చూ ఈడఁబోవు

ఈడుమాఱు = (వెంపొందు) చూ ౫ అడరు

ఈడేఱు = (చేకూఱు) చూ, ౫ అదరు

౨ - (వెంపొందు) చూ, ౫ అడరు

ఈడుముంత = (పాలుపితుకు చెంబు)

ఈడ్గిలఁబడు = చూ, ఈడిగిలఁబడు

ఈడేరుట = (మొదటిముట్టు-పండుట - దాటుట - పోవుట)

ఈడ్వడుట = (సరియగుట)

ఈడె = చూ, 3 ఈడ

ఈఁత = (ఒకానొకచెట్టు)
౨ - (ఈఁదుట)
3 - (గొడ్లులోఁగునవి యీనుట) ఈనిక
ఈఁతకాఁడు = (ఈఁదెడువాఁడు)
ఈఁతకొట్టు = (ఈదు) ఈఁదు ఈఁదులాడు
ఈతఁడు } చూ ఇతఁడు
ఈతగాఁడు }
ఈతల = చూ ఇద్దరి
ఈఁద = (చల్లగాలి) చూ అల్లితెమ్మెర
౨ - చూ ఇందు
ఈఁదర = చూ అల్లితెమ్మెర
ఈఁదాడి } (ఒకానొకచెట్టు)
ఈఁదాడు }
ఈఁదు = (గాలి) ఎసమాలి ఒంటిమాత్రికుల పెనుముప్పు కసవలి కర్వలి గాడుప గాడ్పు గాలి చలిసట్టు చలియిక్కి చిలువమేఁత జంకగుజ్జము కలంతి జంక రవుతు తావిమోపరి తెమ్మెర దుశ్వాగావించు జాణ, నింగిచూలి నీటితాత నెత్తమ్మికొలనికాఁపు పయర పయిర పయ్యర పాముమేఁత, పైర బీదలపెనుబాద మబ్బుపగ మబ్బుమేపరి మబ్బువిప్పు మసతేసు మింటిచూలి మినుచూలు వలపుమోపరి వలి వినుచూలి విన్నుచూలి వీవలి సుడిగొట్టు సుడిగొట్టుజాణ సురసురటివీవనులఁబుట్టు సోఁకు సోఁకుడయ్యము
౨ - చూ ఈఁదాడి
3 - చూ ఇందు
౪ - చూ ఈఁతకొట్టు
౫ - (దాఁటు) ఒడ్డు కడచను కడచు కడవెళ్లు దాంగొన తటియు దాఁటు.
ఈఁదుసు = (తుపానుగాలి)
ఈఁదులాడు = చూ ఈఁతకొట్టు
౨ - (వ్రేలాడు) ఉరియాడు ఊఁగాడు ఊఁగు ఊఁగులాడు ఊవాడు ఊవు తుంపెసలాడు, తూఁగాడు తూఁగియాడు తూఁగు డింపులువోవు, డిత్తరించు వేయు వ్రేలఁబడు వ్రేలాడు వ్రేలియాడు, వ్రేలు, వ్రేలుకాడు
ఈన = (చీఁపురుపుల్ల) ఈనియ ఈనె, పొరక
౨ - (ఆకుపైనుండెడి యీనె)
ఈనిక = చూ 3 ఈఁత
ఈనియ = చూ ఈన
ఈను = (గొడ్లులోఁగునవి దూడబెట్టు)
౨ - (కలిగించు)
3 - (ఇవ్వను - ఈయను)
ఈనె = చూ ఈన
ఈనెగాజులు = (పిల్లలాడుకొనునొకయాట) చూ, అంటి
ఈపి = (పేనగుడ్డు) ఈఁరు పేనుగుడ్డు, పేనుపిల్ల
ఈపె = (ఈమె) చూ ఈకె
ఈబరి } (పనికిమాలినవాఁడు) చూ, అంబేద
ఈబరిగొట్టు }
ఈబిడ } (ఈమె) చూ ఈకె
ఈబిడె }
ఈమిరి = (తడి) చూ ఈరువ
ఈము = (చలవ) చూ ౨ ఇగము
౨ - (ఒసంగము)
ఈమె = (ఈపె) చూ ఈకె
ఈయ = (కోర్కి) చూ ౧. అక్కఱ
ఈయకొను = (ఒప్పుకొను)
ఈయకోలు = (ఒప్పుకోలు)
ఈయది = చూ ఇది
ఈయన = చూ ఇతఁడు
ఈయమ } (ఈమె) చూ ఈకె
ఈయమ్మ }
ఈయేఁడు = చూ ఇయ్యేఁడు
ఈయవి = (ఇవి)

ఈరతార = (మాఱుపల) చూ, అకట వికటము

ఈరము = (పొదరిల్లు) తీఁగయిల్లు తీఁగెయిల్లు పొద పొదరిల్లు పొదరుటిల్లు
౨ - (తుప్ప) ఈరాలు, ఈఱమి, ఈఱము గుండు, చెట్టు జిట్టు జీబు డొంక తుప్ప పుట్ట పొద పొదరు

ఈరాఱు = (పండ్రెండు) చూ ఇరాఱు

ఈరాలు = చూ ౨ ఈరము

ఈరిక = (తునుక) చూ, ౧ అరవరలు
౨ - (మొలక) చూ, ౧ ఇగురు
౩ - (చిగురు) చూ ౨ ఇగురు

ఈరికలెత్తు = (మొలకలెత్తు)

ఈరు = (పేనగుడ్డు) చూ, ఈపి
౨ - చూ ఇరు
౩ - (తక్కువ) చూ ౨. అన్నువ
౪ - (మిక్కిలి కొంచెము) చూ, ౨ అలి
౫ - (ఇడరు - అనుటకు)
౬ - (మీరు - అనుటకు)

ఈరుచు, ఈర్చు } (తిగుచు) ఒడియు చేదు, తిగియు తిగుచు తివియు తివుచు తోడుకు, నిమురు, నుసుము, రెమ్ము

ఈరుపెన = (ఈళ్ళనీర్చెడు దువ్వెన) ఈర్పెన

ఈరువాఱు = (చెరలాటము) చూ అసివాఱు

ఈరువు = (సంజాడు) చూ అరుచి

ఈరె = (పంటెనజుట్టి తీసిన నూలు)

ఈరెండు = (కొంచెముయెండ) నీరెండ

ఈరెలుఁగు = (సన్నగొంతు అవలి) కుఱుచ గున్వ కుత్తుక తీఁగయెలుఁగు తీఁగెయెలుఁగు

ఈరేడు = (పదునాలుగు)

ఈరేను, ఈరైదు } (పది) పది

ఈర్పెన = చూ ఈరుపెన

ఈఱతాఱులు = (వంకర) చూ ౧ ఈచ
౨ - (కఱుకు) కంకర, కరసు, కఱకు, కఱుకు, క్రొవ్విదము గండ్రిలు, చిడిపి దురుసు పరుసఁదనము, పరుసన పరుసము పరుసు పలుసము పిఱుము ప్రల్లదము, మొఱకు మొత్తి

ఈఱమి, ఈఱము } (తుప్ప) చూ, ౨ ఈరము
౨ - (దట్టము) చూ ౪. అచ్చము

ఈల = (దొంగలును అంకుఁబోతులును జేసికొనెడి యొడఁబాటు అవలి)
౨ - (సిగ్గు) కసరు కసురు నాన పుచ్చటిక, పుచ్చడిక, పుచ్చడికె పుచ్చడికతనము, పుయిలోటు, బిడియము, బిడెము బొసుకు లగ్గ సిగు సిగ్గు, సిబ్బితి
౩ - (నెపము) ఓల నెపము, నెవము, వరుకు, సాకము
౪ - (ఒకదినుసు పుల్లగానుండు కూర)
౫ - (చిమ్మట కూఁత)
౬ - (గొల్లవాండ్రు లోనగువారి గుఱుతుఅవలి)

ఈలకఱచు = చూ ఇలకఱచు

ఈలకూఁతలు = (పిల్లలాడుకొను నొకయాట) చూ, అంపలములు

ఈలగ్రద్ద = (పిపినారి) చూ ౨ అడియరి
౨ - (ఒకదినుసుడేగ) చూ, అడుజా

ఈలపురుగు = చూ, ఇలకోడి

ఈలాగు = చూ, ఇప్పాఁ

ఈలుగు = (చచ్చు) చూ, ఇలుగు

ఈలువు = (క్రొత్తడితనము)
౨ - (కూరిమి)

ఈల్గు = (చచ్చు) చూ, ఇలుగు

ఈల్గుట = (చచ్చుట) కడ కుంకుట, గిట్టింపు, గీటడంగుట, చక్కడఁగుట చావు తుది, తెగుట, తుఱంగుట త్రెళ్ళుట పొలి పొలియిక మడియుట, మిత్తి వీడుకోలు వీడ్కోలు, సావు

ఈలువుటాండ్రు = (క్రొత్తదులు)

ఈవ = చూ ఈఁగ

ఈవంక = (ఈవైపు)

ఈవరి = చూ, ఈగికాఁడు

ఈవలి = చూ ఇద్దరి
 ౨ - చూ ఇటుపిమ్మట
ఈవి = చూ ఈగి
ఈవికాడు = చూ ఈగికాడు
ఈవు = (నీవు)
ఈవుల మొదవు = చూ అడిగిన నొసగెడియావు
ఈవులమ్రాను = చూ ఈగిమ్రాను
ఈవులత = (ఒసంగుగాత)
ఈవె = చూ ఈగ
ఈసడము = (దూఱు) చూ అగడాయు
ఈసడించు = (రోతపడు) ఏవగించు ఏవపడు ఓక రించు ఓకిలించు కింకిరిపడు గోరపడు రోతగించు రోయు
 ౨ - చూ అప్పళించు
 3 - (తెగడు) చూ ఆడిపోసికొను
ఈసడింపు = (దూఱు) చూ అగడాయు
 ౨ - (కేరడము) చూ అలచు
 3 - (చులకదనము)
ఈసపిట్ట = (ఒకదిమసుచేప) చూ అంబుపక్కెర
ఈసపోవు = (సన్నగిల్లు)
ఈసలు = (ఫట్టయీగ)
ఈసరిపోవు = (పనిమాలు)
ఈహీ = చూ ఇసిరో

## ఉ

ఉంకించు = (పూను) చూ అంగవించు
ఉంకింపు = (పూనిక) చూ ఆయతము
 ౨ - (కైపు) ఉప్పెన ఎసకము, ఏడ్తెఱ ఏపు ఏప కియిపు కేవుపు, కైపు కొప్పరము గుంపెన, గోటా పట ఛంపఱ చీడఱ డాక ఠవాళి వీక
 3 - (కుప్పింపు)
ఉంకు = (ఒడలబాటు) చూ ఇప్పిరోలు
 ౨ - (ఎగురు) ఉఱుకు ఎగయు ఎగపిపడు ఎగసిల్లు ఎగురు, ఎవయు గోరించు, జగగు జరుగు, జాఱు కుళ్కగించు, తుళ్లియాడు తుళ్లు దాటు దుముకు, దూటుకొను నెగయు నేవయు ప్లుటిగ్గోను, ప్లక్రీడాటు ప్లవ్రైచు మిట్టించు మిట్టపడు మిట్టు, మీటయు విడనిపడు మిడుకు మిడుకుమాలు, లాగించు
ఉంకుటుంగరము = (పెండ్లికూతురు పెండ్లికొడుకు పెండ్లి చేకొనటకు నొకరినొకరొప్పుకొని మార్చుకొనెడి యుంగరము)
ఉంకుడు, ఉంకువ, ఉంకువు = (అల్లుడు పెండ్లికూతురు తండ్రి కిచ్చెడు సొమ్ము) ఓలి పయిడి పైడి పరిండి, సంకు సంకుక సుంకము
ఉంగ = (బిడ్డలకుబోసెడు చనుబాలాముదము) ఉగ్గు, కంగు
ఉంగరపువ్రేలు = (ఉంగరముంచుకొనెడి వ్రేలు) దబ్బవ్రేలు
ఉంగరము = (చేతివ్రేలినగ) ఉంగ్రము
ఉంగడి, ఉంగిడి = (గొడ్లకువచ్చెడినోటిజబ్బు) చూ అదురుద్రిక్క
ఉంగుటము = (బొటనవ్రేలు) పెద్దవ్రేలు పెనవ్రేలు, బొటవ్రేలు బొటమనవ్రేలు బొటవ్రేలు బొట్టనవ్రేలు బొట్టవ్రేలు
ఉంగ్రము = చూ ఉంగరము
ఉంచు = (ఉండజేయు) ఉనుచు
 ౨ - (పెట్టు) తగులగట్టు తగులబెట్టు పెట్టు వేయు
ఉంచుకొను = (పెట్టుకొను)
ఉంట = (ఉండ) ఉండ గుండు
 ౨ - (ఉండుట)
 3 - (గుండ్రము) ఉండ ఉండ్రము గుండ్రము గుడుసు బటువు బవిరి బవ్రి వట్రి వటువ్రి
ఉంటగాలము = (సీసపుగుండు కట్టిన యొకదినుసు గాలము) గోరుగాలము
ఉండ = చూ ౧ ఉంట
 ౨ - చూ 3 ఉంట
ఉండకట్టు = (గుండ్రనగు)
ఉండకొల్లి = (చేతికఱ్ఱ) లాతము లాతాకు

**ఉండసురియ** = (ఒకదినసు పోటుమట్టు - అందలి వేఱడములు) కిల్లగుదియ కరిచిలుకు కొరదు కోల గుమితి గుప్తి చింగోటి చికటారి చిక్కటారి చిప్పకత్తి జముదాడి డొంకెన తగుకత్తి దసి దొంకెన, దోదుముదారి మొహదా సామంతరాగోల సిరాణము

**ఉండి** = (మొదలుకొని యనుదానిఁ దెల్పుమాట)

**ఉండు** = (నిలుచు) చూ ఇమ్ముకొను

౨ - (మెలఁగు) క్రాలు ప్రబ్బు మన మాడు, మెలఁగు, మెలయు

3 - (మిగులు) నిలుచు నిల్చు మిగులు

**ఉండువాఁడు** = (ఎల్లపుడు నుండువాఁడు)

**ఉండే** = (తొడలకు మొదటితావు)

**ఉండ్రి** = (వెలిచండ్రిచెట్టు) ఉండ్రిస ఉండ్రెస, వెలిచండ్రి

**ఉండ్రము** = (గుండ్రము) చూ, 3 ఉంట

**ఉండ్రములు** = (ఒకానొక పిండివంట) ఉండ్రాలు కుడుములు

**ఉండ్రిస** = చూ, ఉండ్రి

**ఉండ్రాలు** = చూ ఉండ్రములు

**ఉండ్రెన** = చూ, ఉండ్రి

**ఉంపడము** = (గుత్తగా వెలయాలి నంచుకొనట)

౨ - (ఉంచుకొనఁబడిన వెలయాలు)

**ఉంబ** = (ఆవులయఱపు) చూ, అంబే

**ఉంబళి** = (పన్నులేనిది)

**ఉక్క** = (ఆటవరి) ఉక్కుతునియ ఉరియ ఉటియ గడుసరి గద్దరికాఁడు గాశిమఁడు, గుండా, టుటారికాఁడు దంట దట్టుఁడు దిటవరి, దిట్ట దిట్టఁడు, దిట్టరి

౨ - (ఉక్కు) చూ 3 ఆవి

**ఉక్కడఁగు** = (ఉక్కచెడు) ఉక్కఱు ఉక్కుమడఁగు

౨ - (చచ్చు) చూ ఇలుఁగు

**ఉక్కడము** = (పెద్ద) ఒడ్డు కంచి కోర, కోలు, గంగ గొప్ప గరు గఱుక గొప్ప జగము దండి, దొడ్డ దొడ్డ నాగ ఎఱ పెద పెద్ద పేరు, పోటు బడ, బలు బవన్న బుజ్జ బొంఁ బోరు మలచము రపణము రేలుఁద సుర హురుమత్తు హుర్మత్తు

౨ - (ఓర్వలేనితనము) ఉక్కణము దెప్పటికము వెక్కసము

**ఉక్కడీఁడు** = (జెట్టి) ఉక్కరి ఉక్కుతునియ, ఎక్కటి గండఁడు గడుసరి చుఱుకరి చుఱుకటీఁడు చుఱుకరి జెట్టి తెంపరి దునీఁడు దునీదారు దుసెదారి దుసేదారి, దుముదారి నెఱసరి పోటరి పోటుకాఁడు పోటుబంటు పోటుమగఁడు బంటు బిరుదు మగఁడు మగవాఁడు మగసరి మాసటి మాసటీఁడు మాస్టీఁడు, మిడిమాసి మొక్కలి, మొక్కలీఁడు మొక్కలుఁడు, మొనకాఁడు మొనసరి, వజీరుఁడు వజ్జీరుఁడు, వజీ్రఁడు వటారి, వీడికాఁడు వడిగలవాఁడు, వడివాఁడు, వాఁడిగలాఁడు, వాఁడిమగఁడు వాలుమగఁడు, సరదారు, హంవీరుఁడు

**ఉక్కణము** = (కావలి) చూ అద్దికము

**ఉక్కఁబట్టు** = (విడుచు) ఉడుగు, ఉడువు ఉరువు, ఎడఁబాయు ఎడయు ఎడలు ఏవగించు, డిగఁద్రావు డిగ్గఁద్రావు డిగ్గనాడు తక్కు తరలు తొలఁగు తొలవు దిగఁద్రావు దిగనాడు దిగవిడుచు, దిగ్గనాడు పాయు పోయు మాన రోయు వదలు, విడఁద్రొక్కు విడనాఁడు విడుచు

**ఉక్కరి** = చూ, ఉక్కడీఁడు

**ఉక్కఱు** = చూ, ౧ ఉక్కడఁగు

**ఉక్కళము** = (ఊరికెదురుగానుండు రేలికదారి)

౨ - (పగతు రత్తివచ్చునను దెలిసికొనుటకై యుంచు కావలి) కోవరము కోపురము

**ఉక్కళుఁడు** = (చెట్టిదుఁడు) మిడిపేలము, వెక్కసి

**ఉక్కిదము** = (ఎక్కసక్కియము)

**ఉక్కిరిబిక్కిరి** = (ఊపిరితిరుగనిది)

**ఉక్కిఱి** = (ఊపిరి వెలికిఁబుచ్చుట)

ఉచుకరించు = (పక్షిరేమి చేన చుక్కమన)

ఉచుక్కు = (ఉచుకరించుట యందగు మ్రోత) చూ అసురుసురు

ఉచ్చ = (గుడినుండి పైకివెడలునీరు) కాలువడి కాల్వడి నీరు

ఉచ్చబుడ్డ = (ఉచ్చయుండెడి తిత్తి) నీరతిత్తి

ఉచ్చమల్లి = (అంగమొలయాడుది)

ఉచ్చి = (నడినెత్తి) బొదల చోడు నడినెత్తి నడుగుంట నుచ్చన నుచ్చెన మాడపట్టు సోడు

ఉచ్చిత = చూ ఉచిత

ఉచ్చిచ్చిరే = (కుక్కను పిలుచుటయందగు మ్రోత) చూ అసురుసురు

ఉచ్చు = (పిట్టలుగోనగు వానికి బెట్టెడియురి) ఉరి, గుచ్చిక జువ్వ

౨ - (నాటికాడలు)

ఉచ్చెత = చూ ఉచిత

ఉజ్జ = (తలంపు)

ఉజ్జగము = (విడచుట) చూ అఱుట

ఉజ్జగించు = (విడుచు) ఉజ్జనచేయు ఏదు కదుచు

ఉజ్జగింపు = (విడచుట) చూ అఱుట

ఉజ్జగిల్లు = (తొలగు) ఉడివోవు ఊడనిబాడు ఎడగిల్లు ఎడయు ఒదుగంబాఱు ఒదుగు ఒదుగునడు ఓగిల్లు ఓరసిల్లు ఓసరిలు ఓసరిల్లు ఓసరు కేడించు క్రేడించు గెంటు చెంగు జడియు జేఱువాఱు తలగు తల్గు తలవు తీయు తూలంబాఱు తూలు తెరలంబాఱు తెరలు తొలంగంబాఱు తొలగు నక్కు పాయగిలు పాయగిల్లు పాయవడు పాయవాఱు పాయు పేడెత్తు క్రిదులు బెడగు బెణగు మిడివోవ వసులు విరియు

ఉజ్జగొను = (తలంచు) ఉజ్జాయించు

ఉజ్జన
ఉజ్జనము } (విడుచుట) చూ అఱుట

ఉజ్జనసేయు = (విడుచు) చూ ఉజ్జగించు

ఉజ్జాయించు = చూ ఉజ్జగొను

ఉజ్జి = (ఈడు) చూ 3 అరగలము

ఉజ్జునకల్లు = (పైన కొండనుండి వెడలగ్రిక్కబడిన రాయి)

ఉటంకము = (టూకి) టూకి

ఉటంకి = (చోరవగలవాడు) ఉటంకు

౨ - (నిబ్బరముగలవాడు) ఉటంకు

ఉటంకించు = (టూకించు) టూకించు

ఉటంకు = చూ ౧ ౨ ఉటంకి

ఉట్టి = (పిడతలుగోనగు నవియుంచుటకై దారములో నల్లి వేలగట్టెడిము పొవ్వగు)

ఉట్టిచీల = (ఇరుప్రక్కల తలయేర్పడినచీల)

ఉట్టిపడు = (మించు) చూ 2 అదరు

౨ - (ఉన్నట్టుండి కనుగు)

ఉట్టు = (ఉప్పుపుట్టినతావు) ఉప్పళము ఉప్పిలము, ఉప్పవాము ఉప్పఱట్టి

౨ - (కాలు) ఉరలు ఊటను ఒలుకు, ఓడిగిల్లు కరగు, కరగువడు కయివాఱు కైవాఱు కాఱు, గిలు చినుకు జల్లించు జాఱు జొబ్బిలు జొబ్బిల్లు తొంగలించు తొట్టు, తొరగు దిగువాఱు వడియు వాఱు

ఉట్రివడియము = (ఒకదినుసు వడియము)

ఉట్లబొద్ది = (ఒకనొక చెట్టు)

ఉడి = (పనికిమాలు) చూ ౫ అటుపటు

ఉడికిల్లు = (క్రాగు) చూ అరటపడు

ఉడికించు = (ఉడుకబెట్టు - క్రాగజేయు - ఎక్కసక్కెములాడి ఉడికిల్లజేయు)

ఉడిగము = (చాకిరి) ఊడిగము, ఊడియము, ఊడెము, కొట్నము చాకిరి

ఉడిగించు = (చాలించు)

ఉడిపోవు = (మొక్కవోవు)

౨ - (పనికిమాలు)

ఉడిపుచ్చు = (పనికిరానట్లు చేయు)

ఉడివోనిపల్కులు = (తొలిచదువులు) చదువుల తొలి చదువులు తొలుచదువులు తొలుబలుకులు తొలుమినుకులు, తొల్పదువులు పెనుమినుకులు ప్రాఁబలుకులు ప్రాజదువులు ప్రాఁతపలుకులు ప్రాఁబల్కులు ప్రామినుకులు ప్రామిన్కులు మినుకులు మొదటిమినుకులు

ఉడివోవు = (తొలఁగు) చూ, ఉజ్జగిల్లు

౨ - చూ ౧. ఆఱడిపడు

ఉడుకు = (బుడుబుడుక్కు) ఉడుక్కు దుక్కు దుపుడక్కు దుబుడక్కు బుడిబుడుక్కు, బుడుబుడుక్కు

ఉడుకాటము = (ఉడుకాడుట)

ఉడుకాడు = (క్రాఁగు) చూ, అరటపడు

ఉడుకు = (మఱుగుడు) చూ ౨ అక్కసము

౨ - (కంటు) బోనసము కంటు కుపారము

3 - (క్రాఁగు) చూ, అరటపడు

ఉడుకుఁబోతు = (ఓర్వలేనివాఁడు) ఏవకాఁడు

ఉడుకువ = (ఊఱుట) ఉడుక్కువ ఊరు ఊఱుట నిలుకడ విఱుగడ

ఉడుక్కు = చూ, ఉడుకు

ఉడుగక = (విడువక)

ఉడుగర = (ఎడమయిన గుడ్డ)

౨ - (కానుక) చూ, ౨ కట్నము

3 - (పగ్గ)

ఉడుగు = (బక్కటిల్లు) ఊడుపడు ఊడపోవు ఊడఁగిల్లు ఒగుడుకొను, క్రియ్యు క్రియ్యఁబాఱు క్రియ్యు చిక్కు డయ్యు తీయు తాఁడుపడు సకిసకిఁబడు సకిసకిలాడు, సకిసకిలుగుడుచు సకిసకిల్లుడుచు సవయు పీఁకివాఱు బక్కటిల్లు వక్కు వట్టు వడియు సాటసాటవోవు

౨ - (విడుచు - మాను) చూ ఉక్కఁబట్టు

ఉడుత = (వీఁపునమూఁడు నిడుపుగీఱలుగల జైతాంపు) ఉఱుత

ఉడుతచార = (గుడ్డలయంచులలోఁగల రంగులు - వాటి భేదములు) ఏనుఁగడుగు కంఠంచు గోటి తప్పు పట్టెమాన్పు పప్పళి బవంతి బొమ్మంచు మాదవళము, మాదళము మాదాకళము మాదాపళి పేరవళి

ఉడుతచారించు = (గుడ్డయంచులలో నొకదినసుది)

ఉడుపకుక్క = (ఉడుములోనగువాని వేటాడెడు చిన్నకుక్క - మోటుకి జాగిలము-అందలి భేదములు) కంచుడమారము కార్చిచ్చు గడివోతు గంద్రగొడ్డలి, దొంగలమిండగీడు బురుకుఁడు మొఱపడము రణభేరు

ఉడుపపిల్ల = (చిన్నపిల్ల)

ఉడుపు = (ఉడుగఁజేయు - ఉడిగించు)

౨ - (దుస్తు)

ఉడుఁబోతు = (ఊఱుఁగఁడువాఁడు)

ఉడుఁబోతుపిండె = (కాపుయుడిగిన పిమ్మట చెట్ల యందు కలిగెడు పిందె)

ఉడుము = (ఒకానొక బల్లివంటి పెద్దమైతాల్పు) ఉడుము ఏపరి, కేలుమేపరి

ఉడువు = (విడుచు - మాను) చూ ఉక్కఁబట్టు

ఉడుసరం = (ఒకానొక చెట్టు) కాఁది కామంచి కల్ల బుడుసగ

ఉడ్కువ = (ఊఱుట) చూ ఉడుకువ

ఉడ్డ = (కుప్ప) ఉడ్డా కుప్ప, కుఱుకు కవ కువ్వ కూటువ కూటువు కొణిఁగ గుట్ట తిట్ట తిప్ప తెప్ప తెట్ట తేప దిబ్బ దిమ్మ దోర పడ పుంజి పుట్ట పోగు ప్రోగు ప్రోక ప్రోవు లప్ప లిబ్బి లొద్ది, వామి

౨ - (నాలుగు) చూ ౧ అడ్డ

ఉడ్డకేలువేలుపు / ఉడ్డకేలుగలాఁడు = (నాల్గుచేతులు గలవాఁడు) చూ అనుగు చెమ్మటలాఁడు

ఉడ్డమోము వేలుపు = (వేల్పుఁబెద్ద) చదువులముదుకఁడు చదువులవేలుపు చదువువేలుపు జన్నిగట్టు తనంతగలయతఁడు తమ్మిగద్దియదళవాయి తమ్మిచూలి, తమ్మిపుట్టు తలపు కేళాకూళి పలుఁగురాతు, తీవంచమో

ములద్దిట్టు తొలువేలుపు ననవిలుకానన్న నలువ నన్నెముదేవర విక్కంపు జగమేలునేర్పుకాడు నెన్న దుర్భను వ్రాయుమనేడు పలుకువెలదివగడు పాటు లకెకిమీడు పెద్దవేలుపు పొంగోరవేల్పు పొక్కిలి చూలి పొక్కిలిపాపడు బంగారు కడుపువాడు మినుకులపణి ముదియనివారిగోడబెద్ద మొదటివేల్పు మొదలుతామరగన్న ముద్దుకొడుకు వేలుపుగమికాడు వేలుపుఁబెద్ద వేల్పుగమికాడు వేల్పుబెద్ద

**ఉడ్డా** = చూ ౧ ఉడ్డ

౨ - చూ ౧ అడ్డ

**ఉడ్డాడు** = (కలఁతపడు) చూ అక్కిలిపడు

**ఉడ్డుగుడుచు** = (ఊపిరి త్రిప్పలేక కస్తిఁజెందు) చూ ౧౦ అడరు

**ఉడ్లపల్లంచి** = (పిల్లలాడు నొకయాట) చూ అంజి

**ఉణుజు** = (ఒకదినుసుచేఁప) చూ అంబుపక్కెర

**ఉరక** = (తలుపు వేయుటకుంబీయుటకు నూఁతగానమర్చిన కొయ్యముక్క) ఉవక రోలుమార్చిన అోలుమ్రాను

**ఉతుకు** = (ఒట్టలులోనగునవి మురికిపోవునట్లు నీళ్ళఁదడిపి గుంజు) ఉదుకు ఉసుము గుంజు ప్రుయము

**ఉత్త** = (కట్టె) చూ ౨ ఈటు

**ఉత్తండములు**
**ఉత్తండాలు** } = ఒకదినుసుఁగూడువారు మెడనంచు కొనునగ) చూ అడ్డిగలు

**ఉత్తరాసి** = (తుప్పకిరింపలిరికొనుకుమసము)

**ఉత్తరించు** = (ముక్కలుచేయు) చూ ౧ అఱవఱసేయు

**ఉత్తరిగ** = (ఒకదినుసు మెడగొలుసు అందలివేఱుడములు) కట్లవండ గుప్పసరము చీర తాళి తాళీ బన్న సరము బన్నసరి ముత్తడము ముత్తెసరము ముత్తెసరి మెఱుఁగునల్లలు

**ఉత్తరేను**
**ఉత్తరేణి** } = (దుచ్చెనచెట్టు)

౨ - (చండ్రచెట్టు) ఉరిమాగ్రిన చండ్రి

**ఉత్తలపడు** = (కలఁతబడు) చూ అక్కిలిపడు

౨ - (తొట్రుపడు) చూ, ౨. అగడుపడు

౩ - (తారుమారగు) తడఁబడు, తారుమారగు, తాఱుమాఱుపడు

౪ - (క్రాఁగు) చూ, ఆరటపడు

**ఉత్తలపాటు** = (దిగులు) చూ, అంజిక

౨ - (తొందఱపాటు) చూ ౬ అక్కఱ

౩ - (ఇడుమ) చూ ౮ అంగద

౪ - (గుండెదిటవులేమి)

౫ - (తొందఱపడుట)

౬ - (క్రాఁగుట)

౭ - (తారుమారగుట)

౮ - (కలఁతపడుట)

**ఉత్తలపెట్టు** = (తొందఱపెట్టు)

౨ - (క్రాఁగుడు పడఁజేయు)

౭ - (తారుమారుచేయు)

౫ - (కలఁతపఱచు)

**ఉత్తలము** = (దిగులు) చూ అంజిక

౨ - (తొట్రుపాటు) చూ ౬. అక్కఱ

౩ - (కలఁత) చూ ౨ అంకిలి

౪ - (మాఱుపల) చూ అకటవికటము

**ఉత్త్రి** = (ఈసు) బదులు పెట్టు, మాఱు

**ఉదక** = చూ ఉతక

**ఉదరిపడు** = చూ అదరిపడు

**ఉదరిపాటు** = (అదరిపాటు)

౨ (ఉలికిపడుట) ఉలికిపాటు

**ఉదరు** = (అదరు - కదలు) చూ ౧. అటమటించు

**ఉదియ** = (పూనిక) చూ, ఆయతము

**ఉదియగొను** = (పూనుకొను) చూ, ౧. అంగలించు

**ఉదిరి** = (మంచి బంగారము) చూ, అపరంజి

౨ = (దిట్టము) చూ ౧, ఇట్టలము

౩ = (కాఁకఁజెందినది)

**ఉదిరిగొను** = (క్రాఁగు) చూ ఆరటపడు

**ఉదిల** = (దిగులు) చూ, అంజిక

౨ - (క్రాఁగుడు) చూ, ౨ అక్కసము

ఉదిలగొను = (కొంచెందు) చూ, ఆరటపడు

ఉదుకు = చూ ఉతుకు

ఉదుట = చూ అదుగు

ఉదుటు = (కెంపుకావరము) చూ ౧ అదటు
 ౨ - (క్రొవ్విన)
 3 - (గట్టి) చూ ఇట్టలము
 ౪ - (అంకము) చూ ౨ అంగము
 ౫ - (ఏపు - మిక్కిలియెత్తు)

ఉదురు = (దిగులు) చూ అంజిక

ఉదురుమిడుకు = (క్రొవ్విసవాఁడు)
 ౨ - (చెడునడుకడి కలవాఁడు)

ఉద్ద = (మిక్కిలి)

ఉద్దనవు = (తాకట్టు) చూ అగావు

ఉద్దము = చూ ఆకుచెప్పులు

ఉద్దర = (తాకట్టు) చూ అగావు

ఉద్దరి = (మిక్కిలిలోతు) చూ ఆవ

ఉద్దసవు = (నేలలోనగునవి తాకట్టుపెట్టి తీసికొనెడి యప్పు) చూ అగావు
 ౨ - (వడ్డిలేనియప్పు)

ఉద్దవడి }
ఉద్దవిడి } = (వడి చూ ౧ అంకపొంకములు
 ౨ - (వరుస) ఓజ ఓలి తెఱగు దార నెప్పు నెతి, పరికము పరువడి బడి మేర లరి వయనము వరువడి వరుస వావిరి వైనము సరవి, సారిది, సాగివి

ఉద్దాలు = (చెప్పలు) గుమ్మెట చెప్పు పైజాలు, పలకడము మలకవాలు మెట్టు లాడుపులు సంకవులు సంపాళిగలు, సమ్మెళిగలు

ఉద్ది = (ఈడు) చూ 3 అనగలము
 ౨ - (ఒకదినుసుపైరు)
 3 - (జంట) కవ, కవలి, గవ జంట జత జనట జమట జమిడి జమిలి జోక జోడు జోడుకోడియ జోడుకోడె దంట, దొందు దోయి, సంగడము సంగడి

 ౪ - (గూడలులోనగు వానితోఁజల్లు నీళ్ళు పారెడు కాలువ మొదలు పచ్చికవెళ్ళలు మొదలగువానిచే నేర్పరుపఁబడిన మిట్టు)

ఉద్దించు = (ఎరపఱచు)
 ౨ - (సరిపోలు) ఉఱు చాయవాఱు చెనయు, దీటుకొను పురుడించు పోలు సక్కళించు సామించు

ఉద్దికాఁడు = (జతఉద్దీడు సైరువాఁడు)
 ౨ - (సంగడీడు) చూ ౨ అంటు
 3 - (సేవ్వి)

ఉద్దియ = చూ ఆయతము
 ౨ - (సరిపోల్క) చూ 3 అనుగలము

ఉద్దియసేయు = చూ ౧ అంగలించు

ఉద్దీఁడు = చూ ఉద్దికాఁడు

ఉద్దులు = (ఒకదినుసుకడ్లు) చూ అక్కుళ్లు

ఉనికి = (తావు) చూ ౨ ఇక్క
 ౨ - (ఓజలాటింటిలో నాల్గవది) చూ, ౧ అండ
 3 - (ఉండుట)

ఉనికిపట్టు = (ఇల్లు) చూ ౧ ఇక్క

ఉనుకువ = (ఉనికి) కాఁపు కాఁపురము

ఉనుచు = (ఉండఁజేయు) చూ ౧ ఉంచు

ఉన్నరూపు = (ఉన్నదున్నట్లు)

ఉన్నవాఁడు = (ఇంకొకఁడు) ఎడకడవాఁడు ఎడవాఁడు, ఎదురు ఒండొకఁడు ఒకఁడు ఒకరుఁడు ఒకరువుఁడు, ఒకొరుఁడు ఒకొరవుఁడు ఒక్కఁడు ఒక్కరుఁడు, ఒక్కరువుఁడు ఒకొరుఁడు, ఒక్కొరవుఁడు, ఒడ్డు, కడవాఁడు తేరకాఁడు రిత్తకాఁడు వింతవాఁడు
 ౨ - (ఉన్నట్టివాఁడు)

ఉన్ని = (గొఱ్ఱెబొచ్చు) తుప్పడు బొచ్చు

ఉన్న }
ఉన్నే } = (ఉండును)

ఉపరాయి = (పెనఁకుకరాని తెలివి)

ఉపమరి = చూ, అనకరి

**ఉపవడము** = (మేలుకొనుట) ఉప్పవడము కనువిచ్చుట మెలఁకువ మెలుకువ మేలుకాంచుట మేలుకొంచుట మేలుకొంట మేలుకోలు మేల్కాంట మేల్కనుట మేల్కొనుట

**ఉప్పట్టు** = (పిల్లలాడుకొను నొకయాట) చూ అందలములు

**ఉప్పర** = (ఓర్వలేనితనముచేత నాడిపోసికొనుట) గుపారు గోరప, రంతు రట్టడి రట్టు, రద్ది రద్దు రవ్వ సుడి

**ఉప్పతి** = (పుట్టుక) కనుబడి పుట్టు పుట్టుక పుట్టుగు పుట్టుబడి పుట్టువు బాము మేను

**ఉప్పతించు** = (ఓర్వలేనితనముచేత నాడిపోసికొను)

**ఉప్పతిల్లు** = (కలుగు) చూ, ౯ అడరు
౨ - (వెల్లివిరియు) ఉప్పొంగు ఉబుకు ఉబ్బతిల్లు ఉబ్బు బొబ్బిలు బొబ్బిల్లు పొంగారు పొంగు వెలి విరియు వెల్లివిరియు

**ఉప్పఁదనము** } **ఉప్పన** } = (ఉప్పగానుండుట)
౨ - (ఉప్ప) ఉప్పు నీళ్ళవరుగు
3 - (చవుటినేల) కారు చగుడు చగడు చవటినేల, చవడు చవుటినేల చవుడు చాట చొడు

**ఉప్పనఁబట్టెలు** = (పిల్లలాడుకొను నొకయాట) చూ అందలములు

**ఉప్పర** = (త్రవ్వియు గోడలు పెట్టియు బ్రతికెడునొక తెగ)

**ఉప్పరము** = (నింగి)
౨ - (మీఁదివైపు) ఎగుడల ఎగువ పయి పై పొడుగు పొడువు మీఁదు, మేలు

**ఉప్పరి** = (ఉప్పరవాఁడు)

**ఉప్పరించు** = (జెట్టిపెన కువలోని యొకరకము) ఉప్పరించు

**ఉప్పరిగ** } **ఉప్పరిగె** } (మేడ)మహాలు మేడ, మేడిల్లు మేలుమచ్చు మేల్మచ్చు సజ్జ

**ఉప్పలవాయి** = (బొట్టన జుట్టన వ్రేళ్ళనడుము)

**ఉప్పలి** = (కీడు) చూ ౨ అంకిలి

**ఉప్పవడము** = చూ ఉపవడము

**ఉప్పళము** = (ఉప్పు పుట్టుచోటు) చూ, ౧. ఉట్టు
౨ - (ఉప్పుసప్పులుండు చోటుఅని కొందఱు)

**ఉప్పళించు** = చూ, ఉప్పరించు
౨ - (బట్టనదుకు)

**ఉప్పి** = (ఒకానొక చెట్టు)

**ఉప్పిఁడి** = (అప్పులేనిది - చప్పన) చప్పఁదనము, చప్పన, చప్పిడి

**ఉప్పరింత** = (ఒకానొక మందుతీఁగ) ఎక్కుఁడుదీఁగ మానెను మానేను మెఱపుఁదీఁగ

**ఉప్పిలము** = చూ, ౧. ఉట్టు

**ఉప్పిళ్లు** = (ఉప్పుడు బియ్యము) ఉప్పుడు

**ఉప్పు** = (కడలినీటితో తయారగు నొకచలి) చూ, ౩. ఉప్పన
౨ - (ఆవిరిపోకయుడికించు)

**ఉప్పుకండ** } **ఉప్పుఁగండ** } (ఉప్పు చమిరియెండఁబెట్టిన సంజాను ముక్క)

**ఉప్పుఁగడలి** = (ఉప్పు నీరున్న మున్నీరు)

**ఉప్పుఁగాయ** = (ఊరుఁగాయ)

**ఉప్పుఁగుందము** = (పిల్లలాడుకొను నొకయాట) చూ, అందలములు

**ఉప్పుఁజేఁప** = (ఒకదినుసుచేఁప) చూ, అంబుపక్కర

**ఉప్పుఁబత్తి** = (తినంతట నప్పు పండెడునేల) చూ, ౧. ఉట్టు

**ఉప్పుడు** = (ఉప్పుడు బియ్యము) చూ, ఉప్పిళ్ళు

**ఉప్పువాము** = చూ ౧ ఉట్టు

**ఉప్పెన** = (కైపు) చూ, ౨ ఉంకింపు
౨ - (కడలి పొంగిపాఱుట) పోటు

**ఉప్పొంగు** = (పొంగారు) చూ, ౨. ఉప్పతిల్లు
౨ - (చెలరేఁగు) చూ ౬. అడరు
3 - (మిక్కిలి వేడ్కఁజెందు) కిడలుకొను

**ఉబలాటము** = (జాలి)
౨ - (ఉత్సాహ) చూ, ౧ అగ్గలిక

ఉబుకు = (పొంగుట)
 ౨ - (పొంగు) చూ ౨ ఉప్పతిల్లు
ఉబుకువాఁడు = (పెంపొందువాఁడు)
ఉబుసు = (తీరికగానుండి చెప్పుకొనుమాటలు)
 ౨ - (పనిలేనితతి)
ఉబుసుపుచ్చుట } మాటలచేఁ బొద్దుఁగడపుట
ఉబుసుపోక
ఉబ్బ = (వేఁడిమి) చూ, 3 ఆవి
ఉబ్బకము = (హెచ్చు) చూ, ౫ అగ్గలిక
ఉబ్బతిల్లు = (హెచ్చగు) చూ, ౨ ఉప్పతిల్లు
ఉబ్బనీరు = (కారుచుండెడు నీరు) ఉమ్మనీరు
ఉబ్బడంగు = (హెచ్చు అడఁగు)
ఉబ్బరపోవు = (ఏమియుతోఁచక కదలక యట్టెనిలచు) తటకాపడు, నిక్కాఱపడు, ముడుగు, తిప్పవడు, వెఱఁగుపడు
ఉబ్బరము = (కడుపుబ్బుట) కడుపుబ్బు
 ౨ - (మిక్కుటము) చూ ౧ అగ్గలము
ఉబ్బరించు = (మిక్కుటమగు) చూ, ౭ అడరు
 ౨ - (కడుపుబ్బు) ఉబ్బు
ఉబ్బలి = (బురద) చూ అడుసు
 ౨ - (పేఁదు చెట్టు) గజ్జరము, పేరొఁదు
ఉబ్బసము = (పొడిదగ్గు) చూ, ఉక్కిస
ఉబ్బు = (వేడుక) చూ, ౧. అలరు
 ౨ - (కెల్లివిరియు) చూ ౨. ఉప్పతిల్లు
 3 - (కడుపుబ్బు) ౨ ఉబ్బరించు
 ౪ - (బొబ్బలెక్కునదిచేయు) పొటమరిలు పొటమరిల్లు, పొటమరించు లేచు
 ౫ - (వేడ్క నొందు) చూ, ౬. అలరు
 ౬ - (లావగు)
ఉమక = (కట్టుదంచఁగా వచ్చినపొట్టు) ఉముక, ఊఁక, నూఁకపొట్టు, పొట్టు

ఉమి = ఉమ్మి ఉమిసెడియెంగిలి) ఉమ్మి
ఉమియు = (ఉమ్మివేయు) కాఱియు, తూపాడుచు
ఉముక = చూ, ఉమక
ఉమ్మ = (వేఁడిమి) చూ, 3 ఆవి
 ౨ - (వంత) చూ అడలు
ఉమ్మగిల్లు = (ఆవిరిచేనడుకు)
ఉమ్మడి = (ఇద్దఱుకలసిచేయు వేరముకానగునది) పొత్తు
 ౨ - (పెనుమాళ్ళ నిత్యపుఁగట్టడ)
ఉమ్మడిన్ = (ఒక్కమాటుగా) ఉఱక, ఉక్కొత్తు, ఒకటన్, ఒకపెట్టు, ఒకపెట్టునన్ ఒకమొగిన్, ఒకయూకన్, ఒక్కంతగాన్, ఒక్కమొగిన్, ఒక్కయూకన్, ఒక్కుమ్మడిన్, ఒకూకన్, ఒక్కత్రు ఒక్కటన్, ఒక్కలనము, ఒక్కలు
ఉమ్మదము = (వేఁడిమి) చూ, 3 ఆవి
ఉమ్మనీరు = చూ ఉబ్బనీరు
ఉమ్మలిక = (వేఁడిమి) చూ, 3 ఆవి
ఉమ్మలము = (వగపు) చూ 3 అడలు
 ౨ - (వంత) చూ, ౮ అంగద
ఉమ్మలి (బురద) చూ అదుసు
ఉమ్మలించు = (వంతఁజెందు) చూ ౧. అంగలారుచు
 ౨ - (వగచు) చూ ౭ అడలు
 3 - చూ ౨ అరికట్టు
ఉమ్మలింపు = (వేఁడిమి) చూ 3 ఆవి
 ౨ - (వంత) చూ, ౮ అంగద
ఉమ్మలిక = (వేఁడిమి) చూ 3 ఆవి
 ౨ - (వంత) చూ ౮ అంగద
 3 - (వగపు) చూ 3 అడలు
ఉమ్మలికము - (వంత) చూ ౮ అంగద
 ౨ - (వగపు) చూ, 3 అడలు
ఉమ్మలికించు = (వంతఁజెందు) చూ, ౧. అంగలారుచు
 ౨ - (వగచు) చూ, ౭ అడలు

